# పాత్రలు.

## పురుషులు.

శివాజీ—కథానాయకుఁడు.

మోరోపంతు—శివాజీకి ముఖ్యమంత్రి.

రామోజీ
తానాజీ
నేతాజీ
గంగాధరుఁడు } మహారాష్ట్ర సేనానాయకులు.

మోఅజీము—ఔరంగజేబుకొడుకు దక్కన్ ప్రతినిధి.

రామసింహుఁడు
జయసింహుఁడు
ప్రక్రమసింహుఁడు
మీర్ జుమ్లా } మొగల్ సేనానాయకులు.

క్
నాఫ్రాద్ } అడవిదొంగలు.

ద్వారపాలకులు, సైనికులు, సేవకులు.

## స్త్రీలు.

రోషనార—కథానాయకి.

దిల్ కుష్
హుషారీ } భోగకాంతలు.

 సూచిక:—నాటకమందలి యంకెలు పుస్తకము చివరనున్న యనుబంధములను సూచించును.

# రోషనార



## ప్రథమాంకము.



రాయగడము — రాజసౌధము.



(శివాజీయును మోరోపంతును ప్రవేశము.)

శివా — సచివాగ్రణీ!

మ. సమరక్ష్మాస్థలి నొక్కచేయి తెగియున్ జాజ్వల్యమానాతిభీ
షమహాశౌర్య పరాక్రమక్రమముచేతన్ మించి వేగొంచు హ
స్తమునన్ ఖడ్గముఁదాల్చి జీవముల యాసన్ వీడి పోరాడు వీ
రమహారాష్ట్రుల ఖ్యాతికృత్యముల 'నౌరంగ్జే' బెరుంగఁడొకో!

ఎఱిఁగియుండియే యిట్టుచేయ సాహసించెనా?

సీ. మన్నహాతీక్ష్ణత 'తోరణ' దుర్గసా
ధనమొనర్చిన నాశతఘ్ని ధాక
ద్రోహియైనట్టి 'యబ్దులు' ను కాళికి బలి
గా నిచ్చినట్టి నాకత్తిధాక

వెనుకఁ 'సఫ్జులుఖాను' ప్రేవులతోడిన
క్రొవ్వాడి నాపులిగోళ్ల దాఁక
అల 'షైస్తఖాను' సైన్యమును జిదుకగొట్టి
గలిగిన నాదు కాల్బలముదాఁక

గీ. ఎట్టిగుట్టపుఱాతులనేని ద్రొక్క-
లించి చెండాఁడు నామానవేలదాఁక
మఱచి మఱల మహారాష్ట్రధరణిమీఁద
నింతలోఁ గ త్రిగట్టంగ నెంచినాఁడె?

మోరో—దేవా! అందినజుట్లు—నందకున్నఁ గాళ్లు ఔరంగ
నకనడకయంతయు, నీ నీతిరాజమునే యనుసరించుచున్నది.

శివా—నిజము. నిజము.

సీ. 'ఖాఁన్' సైన్యరక్తంపుగాల్వల 'కాత్రజు'
కనుమల 'కహతాఁ' కడుగునాఁడు
"దిలెరు" సైనికవీరంబుల "మురారి" "వజీరు
గడ" గుమ్మముల వ్రేలఁగట్టునాఁడు
"సిద్ది" బలంబుల "జంజీర" తోఁగూడ
"మోహిసేనే" భూమిలోఁ బూడ్చునాఁడు
"ఔరంగబా" ద్పురీయవనుల "నేతాజి"
కోరాఁడి "చౌతు"ను గొన్ననాఁడు

గీ. చేయునదిలేక నెంతయు సిగ్గునొంది
దీనుఁడై సంధిగొమ్మని దేవులాఁడె
నాటనుండి మరాటుల యీఁటెపోట్లు
లేమి మఱల ధైర్యముఁగొని లేచినాఁడు.

మోరో—దేవా! దీర్ఘముగా నాలోచించిచూడ, రెండువందల యేండ్లనుండియు, మర్ని రీక్ష్యతేజోవంతమై వెలుగొందుచుండిన యీమొగల్ సామ్రాజ్య మీ యౌరంగజేబుకాలమున నస్తమయపథముబట్టునని శోచించుచున్నది. కాని దేవా! ఈ యౌరంగజేబును గూర్చి నామనవి యొకటికలదు.

ఆ. వె. అమృతనాభుఁడైన యల రావణునిభంగి
విఱిగి విఱిగి మఱల పెఱుగుచున్న
వీని నింతమీఁద విడిచిపుచ్చినయెడ
మఱల మఱల నిల్లు మసలుచుండు.

(ద్వారపాలకుఁడు ప్రవేశము.)

ద్వార—జయమహారాజా! ఎవరో రాజపుత్రుఁడు ద్వారము నొద్దకువచ్చి తమ దర్శనమును గోరుచున్నాడు. ఆజ్ఞ.

శివా—లోనికి బంపుము.

ద్వార—చిత్తము. [నిష్క్రమించును.]

మోరో—దేవా! ఈతఁడెవ్వఁడై యుండును?

శివా—నాకు దురూహ్యముగా నున్నది. మనకు రాజపుత్రులలో నంతగా స్నేహితులు లేరే?

[దేవా! అట్లనుట భావ్యమా? రాజపుత్రుఁడనగు నేను మీకొక స్నేహితుఁడను కానా] (యనుచు రామసింగు ప్రవేశము.)

శివా—ఓహో! రామసింహామహాశయా, స్వాగతము. స్వాగతము.

మోరో—అయ్యా! అభివందనములు.

శివా—ఆర్యా! మీదర్శనము నాకు నిరంతర సంతోషదాయకముగదా.

గీ. చూడరమ్మని పిలిచి యానాఁడు నన్ను
పాదుషా ఢిల్లిలోఁ జెరబట్టినపుడు
మీదు సాహాయ్యమునఁగదా ఖైదుతప్పి
ప్రాణములతోడ నేనట్లు బయటఁబడితి!

మోరో—కావున మహారాష్ట్ర ప్రజాపక్షమునను నాపక్షమునను మీకు పదివేల కృతజ్ఞతాపూర్వక వందనములు.

రామ—దేవా! సచివాగ్రణీ! నేనొనర్చినమేలు కొద్దిదైనను గొప్పదియైనను మీరు మరువకుండినందులకు మిగుల సంతోషపడు చున్నాను.

శివా—రాజా!—

రామ—దేవా! రాజెవ్వరు?

శివా—అదేమి! తాము జయపురిరాజులు కారా.

రామ—ఔను. నేను జయపురమును పాలించుచున్న రాజు ననుట నిజమే. కాని జరీదుస్తులఁదాల్చి, నవరత్నమయ కిరీటమును ధరించి ఛత్రచామరాది చిహ్నములగల్గి నారాజ్యప్రజలనుండి పన్నులు రాబట్టుకొనుచున్నంతమాత్రమున నేను రాజునగుదునా? నా ప్రజల స్వేచ్ఛను, మానమును, మతమును, ధనకనక వస్తువాహనములను తురుష్కులబారినుండి యేనాడు రక్షింపఁగలుగుదునో యానాడుకదా నేను రాజునగుట.

శివా—అట్లయిన మీరాజ్యముకూడ తురుష్కుల యాగడము లకు గురియైనదా యేమి?

మోరో—సంగతుల నరయఁగా నట్లే యైనదని యూహింపనగు.

రామ—ఏమని విన్నవింతును. (1) మహారాష్ట్ర భూపతీ! నావంశపు కన్యకలు మొగలుల అంతఃపురములయందు కోడండ్రుగా

నున్నారు. నేను బిరుదులను జాగీరులను స్వీకరించి, యీ యవురింగ జేబు సైన్యమునందు సేనా నాయకుఁడనుగా నున్నాను. ఏటేట పదిక మూఁడులక్షలు కప్పముఁ గట్టుచున్నాను. మొగలులకిట్లు నేనే బానిసనై యుండగా, నారాజ్య ప్రజలగతి వేఱ యడుగవలెనా? ఈ యవమానముల నెఱిఁగియుండియు మీరు రాజాయని నన్ను సంబోధించుట బాధాకరము.

మోరో—ఆహా! ఆత్మగౌరవమునందు మీకుగల యభిమానము మిగుల స్తోత్రపాత్రము.

రామ—కావున—దేవా! నేను రాజును కాను. తనయింటి యాడువారిని మొగలుల కమ్మక, తనరాజ్యపు సరిహద్దులనైన దాటి వారిని రానీయక, యవురింగజేబుతో స్వాతంత్ర్యగౌరవ రక్షణార్థమై పోరాడుచున్న శిశోదియావంశభూషణుఁడు—విమలామనోహరుఁడు—సార్థకనాముఁ డారాజసింహుఁడే రాజు. తన సైన్యములు స్వల్పసంఖ్యాకములైనను తనకు హిందూరాజులలో నొక్కఁడైనఁ దోడురాకున్నను, సప్రమేయ శౌర్యపరాక్రమములతో మొగలుల నైదుసారులు రణభూమిని నెత్తురుగ్రక్కించి, తనరాజ్యస్వాతంత్ర్యతను గాపాడుకొనిన ఛత్రసాలుఁడేరాజు. దేవా! వీరిరువురకన్న గొప్పవాఁడగు నింకొక రాజు కలఁడు. ఒకవంక బీజపూరు గోల్కొండరాజ్యము లెదిరించుచుండ, నొకచక్క నౌరంగజేబుభటులు నిప్పులుగ్రక్కుచుండ నింకొక చక్క సిద్దీబలంబులు హుంకరించుచుండ నిందఱకును మసిఁబ్రామి, యిందఱ బరాభూతులుగ నొనర్చి మహారాష్ట్రరాజ్యమును మహాశక్తి నొందస్థాపించి హిందూమతమును, హిందూగౌరవమును, హిందూ పౌరుషమును నిలువంబెట్టిన యవతారపురుషుఁడు—భారతమాతృ పవిత్రగర్భశుక్తి ముక్తాఫలము—అట్టి శ్రీశివాజీయే రాజు.

శివా—ఆర్యా! నన్నుఁగూర్చిన మీ యీసదభిప్రాయమునకు మిగుల కృతజ్ఞుఁడను. ఇదియెల్ల భవానీదయ.

రామ—మొగలులును, మొగలులకు నాయకుఁడగు ఔరంగజేబును మిమ్ము కొండయెలుకయనుచు నవగణించిన నవగణింతురుగాక! అంతమాత్రమున మీసహజసాహసప్రవర్తనమును మేమెఱుఁగకుంటిమని యనుకొనఁగూడదు.

మోరో—రామసింహమహారాజా, ఔరంగజేబు మాప్రభువుగారికి కొండయెలుకయనుపేరు నిడుటకుఁ గొంతకారణము లేకపోలేదు.

సీ. మొగలులనెడు ధాన్యపుఁ గోట్లు లెక్కయెయి
కొక్కెక్కి గింజగ పంటనొక్కుచుంట
ధారుణీయుల దాస్యబంధమ్ములనుబట్టి
కొంచెము కొంచెము గొఱుకుచుంట
తన మొండిధైర్యంపు పెనుగోడక్రిందనుగాఁ
బిరికితనమ్ముఁ ద్రవ్వి పెరుఁగొనుట
హైందవస్వాతంత్ర్యమును విఘ్ననాయకు
మూపుపై నిడికొని మోయుచుంట

గీ. యాదిగాఁగల చిత్రకృత్యములచేత
మాప్రభువు మూషికంబౌట మానితంబె;
కాని తాను మార్జాలమేయైన యెడల
నేటియెలుకను గుటుక్కున మ్రింగఁడేమి?

రామ—అమాత్యవర్యా! నిజము. నిజము. ఆతడు చిట్టెలుకను జూచి భయపడుచున్న చిత్రమార్జాలము. ఈసంగతుల నటుండనిచ్చి మహారాష్ట్రనాయకమణీ! నేనిచ్చటికి వచ్చినకార్యమునుగూర్చి చెప్పెదను వినుఁడు. [illegible]! తాముగూడ సావధానముగా విన వేడుచున్నాను.

శివా—
మోరో— } సావధానులము.

రామ—యవనులకు హిందువులపిల్లలనిచ్చి పెండ్లిచేయుటకు మొట్టమొదట దారిజూపినవాఁడు నావంశములోని బిహారీమల్లుఁడు. యవనులయొద్ద గొలువు కుదురుటకుఁగూడ దారిజూపినవాఁడు నావంశములోని మానసింహుఁడే. ఇట్లు కులభ్రష్టతకును, స్వాతంత్ర్యనష్టమునకునుగూడ నావంశమే మార్గదర్శియయ్యె. ఇది నావంశ మొనర్చుకొనిన మహాఘోరపాపము. ఈపాపమునకుఁ బరిహారార్థముగా దేశసేవఁ జేయవలెనను తలంపు నాకుఁ గలిగె. అహహ్యా! మీరిట్లాశ్చర్యము నొందకుఁడు. హిందువుల నెవ్వఁడు సర్వవిధముల నవమానించుచున్నాఁడో యట్టి యౌరంగజేబునకు సేనానాయకుఁడనుగా నున్న నాకు దేశసేవయం దభిలాష కలుగుట హాస్యకరమేయగు; కాని యసంభవము మాత్రము కాదు. నాయభిలాష దీర్చికొ
మార్గములు కలవు. ఒకటి రాజమార్గము, రెండవది కంటకయుతమగు కాలిబాట.

శివా—అనగా?

రామ—ఒకమార్గము నాయుద్యోగమును వదలికొని, పిదప దేశసేవఁజేయుట. మఱియొకమార్గ ముద్యోగమునందుండియే దేశసేవఁ జేయుట. ప్రస్తుత స్థితిగతుల నాలోచించికొని నేను రెండవమార్గమునే యనుసరింప నిశ్చయించుకొన్నాను. ఎట్లనఁగా మీసఖ్యము నిపుడే కోరుదును. నేనెప్పటివలె వానియొద్ద సేనాధిపతిగానుండి, వాని సేనారహస్యముల నన్నిటిని మీకెఱింగించుచుందును. వానిసైనికులను మీచే సులభముగా భంగమునొందు రంగములకు నడిపించుచుందును. యుద్ధసమయమునందు నేను నాభటులతో వానిపక్షమునుండి చీలి మీపక్షము నవలంభింతును. ఈనాపన్నుగడలకు నంగీకరించి మీరు నాస్నేహమున కష్టపడుదురా?

శివా— ఓహోహో! రామసింహమహాశయా! మీధైర్య సాహసవివేకములకు మిగుల నక్కజపడుచున్నాను. ఇదుగో! ఈక్షణము మొదలుకొని మిమ్ము నా ప్రాణమిత్రునిగా నెంచుచున్నాను. (చేతిలో చేయి వైచి) మీపన్నుగడలన్నియు నాకు సమ్మతములు.

రామ— దేవా! ధన్యుడను. ధన్యుడను. (2) నేను వచ్చిన పని యైనది. కృతసంకల్పుఁడనైతిని. కాని నేను స్వామిద్రోహమునకుఁ దలపడితినని మీరు నాయెడఁ గొంచెమైన నసహ్యతను గాంచకుంటిరా!—

శివా— అణుమాత్రమైన గాంచలేను—కాంచబోను. ఆ ఔరంగజేబు దీనధర్మములకు బద్ధుఁడుకాఁడు. స్వధర్మనియమముల బాటింపఁడు. చెప్పినదెల్ల యబద్ధము—చేసినదెల్ల మోసము. వానిని గత్తిచే సాధించుట కష్టము—సామముచే గష్టతరము—దానముచే గష్టతమము. భేదోపాయములచేతనే వాఁడు సులభసాధ్యుఁడగును. అదియుఁగాక నాతఁడు రాజయ్యును హిందూప్రజాద్రోహి. ద్రోహికిఁ బ్రతిద్రోహమే మందు.

మోరో— కాని, దేవా! హైందవులము—ఆర్యులము—న్యాయైక ప్రవర్తకులము—గౌరవైక ప్రధానులము—మనము—నీచముగ ద్రోహమునకొడిగట్టఁదగునా.

శివా— తగిన సమయములయందుకూడ తగునా తగదా యని శంకించియే మనపూర్వులు మనమాతృభూమి కీసేవకావృత్తిని దెచ్చి పెట్టినారు. ఎఱుంగవా!

సీ. ఘోరాజిఁజిక్కిన "ఘోరీని" "పృథ్వీరా"
వెంటనే హతమార్చియున్న
స్థానేశ్వరమును దత్కాలమున హైందవ
స్వాతంత్ర్యనష్టి మేర్పడకయుండు

నద్దాన "బద్మిని" నరయఁచో "ఖిల్జి" ని
యుప్రజా లక్ష్మణసింహులఁ దణచియున్నఁ
జిత్తూరుపట్టణము నన్నిటి స్త్రీలెల్లఁ
జితులెక్కుటయుఁ దటస్థింపకుండు

గీ. నకట! త్రేతాయుగపు బాత్ర యార్యధర్మ
ములను రసపుత్రులింకను బోవిడువక
స్వీయరాజ్యములను గోలుపోయిరట్లు;
ఎప్పుడిక నేర్చుకొందురో యెఱుఁగ, హిందు
రాజు లీకలికాలపు రాజనీతి.

రామ—దేవా! తాము సెలవిచ్చినట్లుల హిందువులు రణ ధర్మబద్ధు లగుటచేతనే తమచేతులఁజిక్కిన క్రూరతురుష్కులఁగూడ జీవములతో విడిచిరి. కాని యవనులకు మొగలులు లేశమైన కృతజ్ఞ తను బొందియుండిరా? చూతము.

సీ. అని నోడి చిక్కినయా "పృథ్వీరాజు" ను
"ఘోరీ" తురుష్కుఁడు గ్రుడ్లుతీసె;
నాలాగెచిక్కిన "హరిపాలదేవు" ని
యల "ముబారికు" చర్మమొలిచి చంపె;
నట్లెచిక్కిన "హేమూ" యనువాని "బహిరాము
ఖానుడు" శిరము చెక్కలుగఁ దఱిగె;
ననినట్లె "రామరాజు" ను "నిజాంషాహా" వే
గము తలద్రుంచి బల్లెమునఁ గ్రుచ్చెఁ;

గీ. జేఁబడినహైందవుల నిట్లు చేవఁదీసి
వారిరాజ్యముల్ మ్రింగినవారెకాని;

వీరధర్మంబటంచును విడిచినారె?
హైందవులవలె, నెత్తివారై తురకలు.

మోరో—దేవా! ఇంతిటను మనకు గర్తవ్యమెట్టిది.

శివా—ఔను. కర్తవ్యమునిక చర్చించుదము. రామసింహ మహాశయా! తాముకూడ మాకీవిషయమునఁ దోడుపడవలయు.

రామ—దేవా! ఆలోచించిచూడఁ బ్రస్తుతమున శత్రునాశనమునకై దండోపాయ మనవసరమని నాకుఁ దోఁచుచున్నది.

శివా—అట్లెట్లు? భేదోపాయమునను శత్రువు వశ్యుఁడగునా?

రామ—అవశ్యము వశ్యుఁడగును.

శివా—వివరింపఁగోరుచున్నాను.

రామ—సింహగడమున కుత్తరదిక్కుగా నరువది క్రోసుల దూరమునను న్న ఔరంగాబాదును ముఖ్యస్థానముగా నొనర్చుకొని విడిచియున్న మొగల్ సైన్యమునకు నౌరంగజేబునకు జ్యేష్ఠపుత్రుఁడగు మోఆజీము ముఖ్యసేనానాయకుఁడుగను, నేనును జోధపురరాజగు యశోవంతసింహుఁడును సహాయసేనానాయకులముగను నున్నామని మీరెఱింగియే యున్నారుకదా!

శివా—
మోరో— } ఔను.

రామ—అందు మోఆజీము శౌర్యము నౌదార్యము గలవాఁడు; కాని విషయలంపటుఁడు. అమితవ్యయమునొనర్చును. మధ్యపాయి-హారుడు-పలికినకపకమే యందఱను నమ్మును. ఇక యశోవంతసింహు దైన్యవాఁడనఁగా, గపుల్లోభి—ధనమునందలి కక్కుర్తి మెండు కావున వీరిద్దఱినిగూడ వశమొనర్చుకొనఁదగును.

శివా — అగునగు. సులభముగా వశమొనర్చుకొనగను.

రామ — కాని, వశీకరణోపాయము మాత్రము నాకు తోఁచకున్నది.

మోరో. — ఉపాయములకు లోపముసేయని మా ప్రభువుగారున్నారుకదా !

శివా — (ఆలోచించి) సరే ! ఆర్యవర్యా ! భేదోపాయమునే ప్రయోగించుదము. ఎట్లనగా మీరు వెంటనే పయనమైపోయి మఱల మీసైన్యములఁ గలసికొనుఁడు. నేను నేటికే సరిగా నారవనాటికే, మోఱేశునకు రెండులక్షల రూప్యములకును యశోవంతసింహునకు లక్షరూప్యములకును సరియైన స్వర్ణమౌక్తికహారాదులను బంపెదను. మీపేరిట చెరియొక యుత్తరమునుగూడ నంపెదను. వానినన్నింటిని వారికి మీరందచేయవలయు.

రామ — చిత్తము.

శివా — నేనంపిన బహుమతులను వారొకవేళ గ్రహింపకుందురేని మీరెల్లయును ప్రోత్సాహపరచి తుద కొక్కపదునైదు దినముల నరకైన వారు తమముఖ్యస్థానమును విడిచి నామీఁదికి యుద్ధమునకుఁ బయలుదేరకుండునట్లు చేయవలయును. ఇట్లు మీరు చేయఁగలరా ?

రామ — చేయగలనని దృఢవిశ్వాసము.

శివా — మంచిది. ఈపదునైదు దినములలో నేను చేయవలసిన ఘనకార్యమొకటి కలదు. చిరకాలము వెనుక మీతండ్రియగు జయసింహునిచే సాధింపబడినప్పటినుండియు మాసింహగడము మీమొగలులచేతియందే యుండియున్నది. ఆకతమున చాకణ్ దుర్గమునుండి పూనాకువచ్చినపుడు నాకు మిగుల నిబ్బంది కలుగుచున్నది. సింహగడము మహారాష్ట్రమునకు గుండెవంటిది. ఇది పూనాకును రాయ

గడమునకును చాకణ్ పురందర్ దుర్గములకును కేంద్రమైయున్నది. ఆకతమున దీనియందున్న శత్రువు లీనాల్గుస్థలములకుగూడ ముప్పుగలి గింపగలరు. కావున దీనిని సత్వరము సాధించుదును.

రామ—సరే. దేవా! నేను వారినిరువురనచ్చట జోకొట్టు చుండెదను. ఆసమయమున నీపదునైదుదినములలో మీరు మీ సంక ల్పము నెరవేర్చుకొనుఁడు.

శివా—మంచిది. రామసింహామహాశయా! ఇంతేసంగతులు.

రామ—ఇక నాకు సెలవా?

శివా—చిత్తము.

రామ—అయ్యా! సచివాగ్రణీ! సెలవు.

మోరో—చిత్తము.

రామ—(తె) [నిష్క్రమించును.]

(ద్వారపాలకుఁడు ప్రవేశము.)

ద్వార—జయ మహారాజ! తానాజీమాలసురేగారు దేవర దర్శనార్థము వచ్చియున్నారు.

శివా—లోనికిఁ బంపుము.

ద్వార—చిత్తము. [నిష్క్రమించును.]

(తానాజీమాలసురే ప్రవేశము.)

తానా—దేవా! నమస్కారములు. సచివాగ్రణీ! వందనములు.

శివా—మిత్రుఁడా మహారాష్ట్రసేనానాయకమణీ! ఏకతమున నాసముఖమునకు వచ్చియున్నారు?

తానా—దేవా! మన యీరాయగడమున కేనిమిది క్రోసులలో నుత్తరదిక్కుగా చక్కనిపల్లెయొకటి పోవుచున్నది. దానిచుట్టును

ముప్పదుగురు తురకబంటులు కావలిగానున్నారు. పల్లకీ యారంగ జేబు కొడుకగు మోజీమెక్కి తిరుగు పల్లకీవలెఁ గాన్పించుచున్నది. శతవిధముల నందు మోజీమే యుండవచ్చును. ఈసమాచారములను నా చారులమూలమునఁ దెలిసికొని మీకు విన్నవింపవచ్చినాఁడను. సంధినియమములఁ ద్రోసిపుచ్చి యారంగజేబు మనపై మరల యుద్ధ మునకుఁ బూనుకొనెను. కావున, నీపల్లకీనిబట్టి తీసికొనిరమ్మనెదరా ?

శివా— (ఆలోచించి) సచివా ! పల్లకిని బట్టుకొనుటయే మేలని తోఁచుచున్నది. అందు మోజీమే యుండుట సంభవించునేని ఏయుద్ధ మును జేయకయే యారంగజేబును మన మోడింపనగును. కావున నో సేనానాయకమణీ ! తానాజీ ! మీరవశ్య మాపల్లకిని జేపుసాయంత నములోపున బట్టుకొని దానిని మిగులరహస్యముగా నాశయనమంది రములోనికిజేర్చి నాకుఁ దెలియఁజేయుడు.

తానా— చిత్తము.

శివా— ఇంకొకటి. ఆపల్లకీయందున్నవారి కెట్టియపాయంబును గాని గలుగఁజేయఁగూడదు. మరియు నందున్నవాఁడు మోజీమగునా కాదా యనుసందేహము నివర్తించుకొనుటకై ప్రయత్నింపగూడదు. ఒకవేళ పల్లకీయందు స్త్రీయుండుట సంభవించి, యామె విలపించిన యెడల నామెను గన్నెత్తియైనఁ జూడక బల్లకీ నచటనే విడచిరావలయు మీభటుల కిట్టియాజ్ఞల నిండు.

తానా— చిత్తము.

శివా— ఇక మీ రేగవచ్చును.

తానా— మహాప్రసాదము. సచివాగ్రణీ ! సెలవు.

[నిష్క్రమించును.]

మోరో—దేవా! ఇక సింహగడ సాధన విషయమై యాజ్ఞ యేమి ?

శివా—సింహగడరక్షకుఁ డుదయసింగు. ఆతఁడు రాజపుత్ర వీరసింహము. అతనికి సర్వవిధముల నీడగువాఁడు మనతానాజీ కావున నేమవందల మావళేభటులతోఁ దానాజీ సింహగడసాధనార్థియై సత్వరము పోఁగలఁడును.

మోరో—చిత్తము. కాని, దేవా! ఇట్టి భేదోపాయములను బట్టుకొని పెనగులాడుటకన్న మన యమోఘదండోపాయమునే నిర్భయముగా బ్రయోగింపరాదా ?

శివా—సచివా! అట్లుకాదు.

గీ. తతమహారాష్ట్ర రాజ్య సంస్థాపనమున
కిదివరకె మరాటీ రక్తనదులుపాఱె
రక్తపాతము నికమీఁద శక్తికొలఁది
నాపుటయె చూడ జాల శ్రేయస్కరంబు.

అదియు గాక యుద్ధమన్న నేమనుకొంటిరి !

సీ. దేశాభివృద్ధి నుద్దీపించువ ర్తక
వ్యవసాయవృద్ధికి హద్దుగీత
ప్రేవుల కండలఁ బిడిచి నెత్తురుపీల్చు
కఱవుదయ్యములకుఁ గల్పతరువు
చేటలతోనె త్తి చెఱగు మహామారి
మొదలగు రుజులకు మొదటివేలు
బాలల బాలుర పడతుల వృద్ధుల
వేడికన్నీళ్లకు బాఁడిపంట
ఆ. వె. దార్లుకొట్టి బ్రతుకు తస్కరావళులకు
హత్యజేసి బ్రతుకు హంతకులకు

నీప్సితార్థమిచ్చు నిష్టాధిదేవత
యరయ రణము సర్వహరణమనుమి.

ఏయుద్ధములును లేక రెండేండ్లనుండియు మన ప్రజలు సుఖముగానున్నారు. వారికి మఱల నింతలో ఘోరయుద్ధము నొకదానిని సమకూర్చి సంకటపెట్టుటకు నాకు మనసు రాకున్నయది.

మోరో—చిత్తము. మీయభిప్రాయమును గ్రహించితిని.

శివా—ఇక నేనుద్యానవనమునకు బోయెదను. నేను రామసింహునితో నిందాకఁ చెప్పినట్లు బహుమతుల నిర్ణీతదినమున కౌరంగాబాదు చేరునట్లు చేయుము. ఇంకొకటి. మోఅజీము రసికుఁడని వింటిమికదా! దౌలతాబాదునందు కడుచక్కని తురకవెలయాండ్రున్నారని వదంతి. అందిరువురు వెలయాండ్రకు దగిన ధనమిచ్చి మోఅజీమునకు బహుమతిగాఁ బంపుము. శత్రుసాధనమున కిట్టివికూడ సమంజసములేయని పెద్దలు చెప్పుదురు.

మోరో—చిత్తము. నాకిక సెలవు.

శివా—మంచిది.

[ఇరువురు నిష్క్రమింతురు.]



# ద్వితీయాంకము.

## రాయగడము—శివాజీ శయ్యాగృహము.



(పల్లకిలోనుండు రోషనార వెలికి ప్రవేశించును.)

రోష—(ఆతురతతో గదిని బరీక్షించుచు) ఇది రాయగడ మగునా, కాదా! ఈమందిరము శయ్యామందిరమువలె నున్నదే! గోడలకుఁ గొట్టబడియున్న యీపటములనైనజూచి, యీమందిర మెవ్వనిదో గ్రహించెదగాక. (పటములను బరిశీలించి) ఓహోహో! ఇదిగో! శివాజీచిత్రఫలకము. నేననుకొన్నట్లైయైనది. హాయాశలే పండినవి. ఇది రాయగడము. ఇది శివాజీ శయ్యామందిరము. (4) (పటమును దిలకించి) ఆహా! ఆయనను చూడఁజాలకున్నను తచ్ఛాయ నైన జూచుట నేటికి తటస్థించెఁగదా! (పటమును రెప్పవాల్పక జూచుచు) ఓయీ! మహారాష్ట్రరాజ్యస్థాపకా! నేనెవ్వతెనో నీవెఱుం గుదువా? నేను రోషనారను. ఔరంగజేబునకు సోదరిని. నన్ను నీ వెన్నడును జూచియుండలేదు. కాని, సుకుమారా! నేను నిన్నొ కప్పుడు చూచియుండినవిశేషమును నీవెఱుఁగవుసుమీ! అలనాఁడు నాసోదరుఁ డాహ్వానముసేయ నీవు ఢిల్లీకేగుదెంచి రాజసభామందిర మున నాసోదరునియెదుట నిలువంబడియున్నప్పుడు, ఆ ప్రక్కమంది రమునందలి గవాక్షపు దలుపులచాటునుండి యేవనిత—యేభీతహరి ణేక్షణ—యేవివిధవికార సంచలితహృదయ—నీపై క్రేఁగంటిచూపులు ప్రసరించెనో నీకు దెలియునా? అక్కటా! ఆ క్రేగంటిచూపులతోఁ బాటు, నాహృదయముకూడ రెక్కలువచ్చిన పక్షివలె లేచి నీపై వ్రాలెనుగదా! ఆనాఁడు మొదల్కొని యీదీనురాలు తనయనురాగ

మును—దురదృష్టానురాగమును—అణంచుకొనుటకుఁ బలువిధముల ప్రయత్నించెను. కాని, ప్రయత్నము లన్నియు విఫలములై తుద కనురాగమే జయించి, నాహృదయసింహాసనము నధిష్ఠించి నాభావ రాజ్యము నేకచ్ఛత్రముగఁ బరిపాలింపఁదొడఁగెను. అది మొదలొకటని నిన్ను స్మరించుకొని వేడినిట్టూర్పులుపుచ్చి యశ్రువుల రహస్యముగా రాల్పని దిన మొక్కటియైన లేదుకదా! ఏమానవుని సౌందర్య సంప ద్విలాసములకును మోసపోకుండిన యీహృదయము—ఈకఠినకర్కశ హృదయము—నీమూర్తి దర్శనమైనతోడనే చంద్రదర్శనమున జంద్ర కాంతశిల కరగినట్లు కరగినది. (5) మనోహరా! ఈయనురాగభార మును వహింపజాల—వహింపజాల. ఇదిగో మానవుని కెవ్వనికి నింత నఱకు లభింపని యీనామొదటి ముద్దిదుగో! (పటమును ముద్దిడు కొని) కాని, మనోహరా!

సీ. మోహనంబైన నీమూర్తికి మదిలోన
హెచ్చుగా మెచ్చి నీకిడినముద్దు,
కడుననాయాసముగా నన్ను నీవంక
కీడ్చిన నీప్రజ్ఞ కిడినముద్దు,
మొదటిచూపులతోన మొదలంటనాధైర్య
మడగించినట్టి నీకిడినముద్దు,
పొదలువేదనకు లోనదరి నిన్ శరణంబు
నిడుమంచు మొఱఁబెట్టి యిడినముద్దు,

గీ. అట్టి యీముద్దు—నావరహాలముద్దు
మఱల నాకీయవేల? యోమదనరూప!
ఆడువారల సొమ్మిట్టు లపహరించి
యెన్నినాళ్లు వర్ధిలెదవో యీ పృథివిని?
(కాలిచప్పుడు వినఁబడును.)

ఏదో చప్పుడు వినవచ్చుచున్నదే! (పటము నెప్పటి-చోటున చటుక్కున దగిలించి) చప్పు డీదిక్కునుండి వినవచ్చుచున్నది. (ఆదిక్కు జూచి) ఆహా! ఆహా! నాయదృష్టము నేమని కొనియాడుదును! నా ప్రియుండు—నామనోహరుడు—ఇదే వచ్చుచున్నాడు. (?) ఈపల్లకి నాసోదరుని కుమారుడగు మోఅజీము దగుటచే, నాతడే యీపల్లకి యందుండెనని పట్టించియుండనోపు, అయినను నీయన యభిప్రాయమును దెలిసికొందుగాక!

[పల్లకిలోనికి నిష్క్రమించును.]

(శివాజీ ప్రవేశము.)

శివా—(పల్లకి నెగాదిగజూచి) అగునగు. మోఅజీ మీపల్లకి నెక్కి తిరుగుట నేనుంగూడ పలుసారులు చూచియున్నాను. తానాజీ చెప్పినట్లు తప్పక దీనియందు మోఅజీమే యుండియుండవచ్చును. పలుకరించెదంగాక. (సమీపించి) పల్లకియందున్న యోవ్యక్తీ! నీవు మోఅజీమువని నేను గ్రహించితిని. నేను మహారాష్ట్ర రాజ్యాధిపతిని—శివాజీని. నీతో స్నేహరీతిగాం గొన్ని రాజకీయ ముఖ్య రహస్యములను ముచ్చటింపదలచి మఱొకతీరున నీదర్శనము లభింపమి, యీతీరున లభింపంజేసికొంటిని. నీకు హానిచేయవలెనను తలంపు నాకు లేశమైన లేదనుటకు నిదర్శనముల నుడువుచున్నాను వినుము. నా ప్రజలకును, సైన్యమునకును, నాకును ఘోరశత్రువువైన నీయెడలం బ్రతి మహారాష్ట్రునికిని కుత్తుకబంటి కోపముకలదు. వారిలో నెవరికి జిక్కినను తత్క్షణము నిన్ను హతమార్చియుండును. అందువలన వారికి దెలియకుండ కడురహస్యమున నిన్ను బట్టించితిని. వారి క్రోధదృష్టులు నుంతయేని జొరరాని యీయగమ్య రహస్యశయన మందిరమున నిన్ను నిక్షేపించితిని. ఇప్పటికైన నాహృదయమును గ్రహించితివా? కావున నిర్భయముగా వెలికిరమ్ము.

(రోషనార ప్రవేశము.)

శివా——(ఆశ్చర్యస్తబ్ధు డగును.)

రోష——రాజా! ఆడుదానవగు నన్ను బట్టుకొని మరెచ్చటను గాక మీయీ శయ్యాగృహమునందే చెఱబెట్టియుంచుట మిముబోటి హిందూరాజులకుఁ దగినపనియా ?

శివా——ఆహా! దైవమా! ఎంత పొరపాటయ్యె ? (ప్రకాశముగా) మీరెవ్వరు ?

రోష——మేమా ? ఆఁడువారమనుసంగతి తెలియుటలేదా ?

శివా——బాగు బాగు. మీరాఁడువారనుసంగతి నాకుఁ దెలియక పోలేదు. కాని——

రోష——ఔనౌను. తెలిసియుండె గావుననే మోఅజీమను వంక నొకటి బెట్టుకొని నన్ను చెఱబెట్టినారని నేనిందాఁకనే చెప్పితిని.

శివా——ఔరా! ఏమాట కేమాటలను లంకెవేసినది. (ప్రకాశముగా) అట్లుకాదు. తమ నామధేయమేమి ?

రోష——నామధేయమా! రోషనార.

శివా——ఏమీ! ఔరంగజేబునకు సోదరి——అష్టాదశభాషల యందనుపమాన పాండిత్యమును సంపాదించిన విజ్ఞానవతి—సర్వవిధ రాజకీయ తంత్రములయందు గడతేరిన ధీశాలిని—అత్యంత ప్రజ్ఞతో యుద్ధములనుగూడ నడుపఁగల రణనీతివిశారద—ఆమె ఆరోషనారా నారీమణీ—మీరేనా ? ఆహా! అట్టి మీదర్శనము లభించుటచే నేడు సుదినము—మిగుల సుదినము. కాని నారీమణీ! ఢిల్లీనుండి తమరీ ప్రాంతములకు వచ్చుట యెట్లుసంభవించె ?.

రోష——రాజకీయసంబంధములైన కొన్నిపనులమీద నన్ను తనకుమారుఁడగు మోఅజీమునొద్దకు పాదుషా పంపగా వచ్చియుంటిని.

శివా—ఓహో! గ్రహించితిని. అట్లువచ్చి, ఏదోపనిమీఁద మీరు మోఁఅజీముని పల్లకి నెక్కిపోవుచుండ, మేము నిజముగా మోఁఅజీమే పల్లకీయందుండెనని భ్రాంతిపడి పట్టుకొంటిమి. అది పొరపాటయ్యె. కాని మీరొక్కపనిఁ జేసియుండవలసినది.

రోష—ఎట్టిపని?

శివా—లోయలో నాభటులు పల్లకి బట్టుకొనుచున్నయపుడు వారితో "నేనాఁడుదానను—నన్ను విడువుఁడు" అను రెండు మాటలే చెప్పియుండినయెడల, వారు సత్వరము మిమ్ము విడచిపెట్టుటయేగాక, వలయునెడ మిమ్మచటనుండి మోఁఅజీమునొద్దకుగాని లేక మీయిచ్ఛవచ్చిన మరేచోటికిగాని తీసుకొనిపోయి యుందురు. అట్లొనర్చియున్నచో మీకీశ్రమకాక, శ్రమ కలుగఁజేసితిని కదాయని నాకీచింతగాని గలుగకపోయి యుండును. అబలలను—ఎట్టిసమయమునందేమి—ఏనెపముమీఁదనేమి—నాయాజ్ఞలేనిదే, చెఱబెట్టరాదని నేను సర్వసైన్యములకు నుగ్రశాసనము నొందువిధించియున్న విషయమును బహుశః మీరెఱుంగరు కాబోలు.

రోష—యెఱుంగుదును. కాని (తనలో) నాయంతరంగమును సూచించుటకిదియే సమయము. (ప్రకాశముగా) కాని, రాజా! ఏముఖ్యోద్దేశముతో నేను ఢిల్లీనుండి యీమహారాష్ట్రప్రాంతములకు వచ్చియుంటినో, యాయుద్దేశమును నెరవేర్చుకొనవలెననియే యీనీ శాసనము నెఱింగియు ఆరెండుమాటలను నీభటులకుఁ జెప్పకొననైతిని.

శివా—నాకు బాగుగా నర్థముకాలేదు.

రోష—ఇంతమాత్రమర్థమును గ్రహింపజాలవా? పోనిమ్ము. విప్పిజెప్పెదను వినుము. ఆపల్లకీని బట్టుకొనుచున్న సమయమున నే సంతయు గ్రహింపజాలితిమి నీరాజగడమును జూచుసమయము తలవని

తలంపుగాఁ దటస్థించెగదా, యీసమయము నేల పోఁగొట్టుకొనవలయు నని యూహపడి యారీతిఁ జేయుచుంటిని.

శివా—ఇంతకును మారాయగడముపై నింతటి యపూర్వ దయ మీకేల గలిగె?

రోష—పలయనగా, నాకుఁ బ్రాణసమానమగు వస్తువీగడము నందుండుట సంభవించె. దానిని నీయనుగ్రహమున సంపాదింప వలె నని వచ్చితిని.

శివా—[ప్రకాశముగా] ఆవస్తువెట్టిదో నేఁనడుగదగునా?

రోష—చెప్పుమందువా?

శివా—ఇష్టమైనయెడల.

రోష—సరే. ఒక్క ప్రశ్నకుమాత్రము ప్రత్యుత్తరమిమ్ము. ఆఁడుదానికి బ్రియతమమగు వస్తువేద్ది?

శివా—అందముపై నధికారము.

రోష—అదిగాక.

శివా—ఆభరణములు.

రోష—ఓరాజా! నీవు పేర్కొనినవన్నియు బహిరాభరణములు. నీకు దెలియకపోయిన నేనైనఁ జెప్పెదవినుము. ఆఁడుదానికి—అనఁగా, నాబోఁటికన్యకు—నవలావణ్యవిలాసినికి—రాజా! వినుము. వినుచుంటివా? నినుబోలు వీరసుకుమారుఁడే మిగులఁ బ్రియము గూర్చువస్తువు. [7]

శివా—అబ్బా! ఇప్పటికీమె తనమనసు వెల్లడించినది. కాని తన యీమోహము నిష్ఫలప్రదమని యీమె తెలిసికొనునప్పు డెంత

చింతించునోకదాయని మిగుల జాలికలుగుచున్నది. [ప్రకాశముగా] అమ్మా—

రోష—అమ్మా? ఇదేమి పాపము.

శివా—సరిసరి. ఇదియుగూడ దప్పేనా? మఱెట్లు పిలువ మనియెదరు.

రోష—ఎట్లా? నన్ను ప్రియాయని, మనోహరియని లేక ప్రేయసీయని పిలువుము.

శివా—హరహర! పాపము శమించుగాక!

రోష—(ఉ) మనోహరా! పరులు చూచెదరేమోయని దుడుకునొందుచుంటివేమో, వద్దు. మనము రహస్యముగానే మెలంగ వచ్చును.

శివా—నారీమణీ! అంతకన్న వెఱ్ఱికలదా?

గీ. లాతివారలునోళ్లు తాళములవేసి
మిక్కిలి రహస్యవిధమున మెలగవచ్చు
గాని, సర్వంబు నెల్లపుడుగాంచు దేవు
కనుల కేరీతిఁ గంతల గట్టగలము?

రోష—అది పరలోకవిషయము. అదియుగాక దైవదృష్టికి మనము వెఱువనేల? మనమిరువురమును లోక సహజముగా నొకరి నొకరు ప్రేమించుకొనుచున్నామే కాని హత్యజేయుటలేదు కదా! చోరత్వమునకుఁ బూనుకొనుట లేదుగదా—మఱెట్టి ఘాతుకకృత్యము నకుఁగాని యొడికట్టుట లేదుగదా. ఒకవేళ మనయనురాగమే ఘాతుక కృత్యమందువా? అట్లైన దైవమునకీ స్త్రీపురుష సృష్టియేల? కావున నోరాజా! పలుగాకు లగులోకులకు మనము భయపడవలయునే గాని, దైవము ప్రతికూలుఁడగునేమోయను భీతి నొందనక్కఱలేదు.

శివా—అబలా! విద్యావంతులగు మిముబోటి స్త్రీలెల్ల రిట్టి నవీన సిద్ధాంతములనే చేసియుండినచో స్వస్త్రీ పరస్త్రీయను భేదమే లేక మానవకోటి జంతుకోటికన్న నధోగతి నొందియుండెడిదికదా. (9)

రోష—మనోహరా! తక్కటిస్త్రీలు నావలెచేసిరా యను చర్చయేల? అదియుగాక,

ఉ. చేసిరో లేదో యారయకె చెప్పగ శక్యమె? మైన, నావృథా
యాసములేల? రమ్మటుల హాయిగబోయిఁ వనాంతరంబునన్
భాసిలు కోమల ప్రసవభారవినమ్రనికుంజవీధిలో
నీసులులేక వర్తిలుదమీ క్షణమాదిగ నెల్లవేళలన్.

శివా—నారీమణీ! నేను మిగుల బశ్చాత్తాప పడుచున్నాను. ఈమందిరమునందు మిమ్ము జూచినవెంటనే నేను వెడలిపోయి యుండినచో మీారీపాటుఁబాటునఁ బడకుండియుందురు. ఆరీతిఁ జేయక నిలువఁబడి మీాతో మాట్లాడుచుండుటచే మీారు నాయందు తప్పుదలంచి యున్నారు. ఇప్పుడైన జెప్పుచున్నాను వినుడు. ఇరువురు భార్యలతో గృహస్థాశ్రమమున నున్నవాఁడను—నాయంతవారైన యిరువురు కొడుకులకు తండ్రిని—మీాదుమిక్కిలి జీవిత మధ్యాహ్నమును గడచినవాఁడను—హిందూమతాచారములయం దపరిమిత భక్తి కలవాఁడను—గోబ్రాహ్మణ రక్షణ దీక్షాపరుఁడను—శ్రోత్రియక్షత్రియుఁడను—అట్టినేను మిమ్ము మోహింతుననుట స్వప్నగత వృత్తాంతము.

రోష—(10) అక్కటా! ఇదేమిపాపము?

మ. ప్రియుఁడా! నీకు మదీయరూపధన మర్పింపంగ లోనెంచి; ని
ర్భయలీలన్ ననుస్వీకరింపుము, ననున్ బాలింపు, నన్గూడి దు
ర్జయసౌఖ్యంబులనొందు మోయి సుకుమారాయంచు ప్రార్థింపఁగా
భయమో, సిగ్గో, విచారమో, వినవు నాపల్కుల్ కడున్మూర్ఖతన్.

శివా—రోషనార! ఈ ప్రసంగము మీకును నాకునుగూడ వృథాయాసకరము. మఱల చెప్పుచున్నాను వినుడు. నాయందు మీరు సోదరేతరభావము నుంచుకొనుటతగదు. పాదుషాయంతటి వానికి సోదరివి—మహదైశ్వర్యమున నోలలాడుదానవు—సకలవిద్యా ప్రవీణురాలవు—మీదుమిక్కిలి సౌందర్యనిధివి. కావున నాప్గని స్థానము, అరబీస్థానము, పారసీకము, తుర్కీ మొదలగు రాజ్యముల బాలించు నేసుల్తానునైనను మీరు వరింపఁదగునుకాని పరమతస్థుండను మీదుమిక్కిని సోదరునకు గర్భవిరోధినగు నన్ను వరించుట మిగుల హాస్యకరము. ఇప్పటికైనను యుక్తాయుక్తముల నరయుడు. మీమేన యల్లుఁడగు మోఅజీముఁనొద్దకు మఱల సురక్షితముగా నిప్పుడే పంపె దను లెండు.

రోష—ప్రియుఁడా! నీవింతవఱకు నేమిపలుకుచుంటివో నేను విననేలేదు. ఏమందువా? అదుగో యాగవాక్షమున కావల,

ఉ. అల్లదెచూడుమా చిగురుటాకుల నాకలిఁదీర్చుకొంచు, న
త్యుల్లసనంబుతో నొకటి కొక్కటెదోగొడవన్ వచించుకొం
చల్లన నిన్ను నన్నుఁగని యాపికదంపతు లేగతిన్ సుధా
సల్లలితస్వరోక్తి దమచక్కిఁకిరమ్మని పిల్చుచుండెనో!

కావున నచ్చటికిబోయి యాకోకిలలపాట నాలకింతము రమ్ము.

శివా—ఏమీ, కోకిలలపాటయా!

గీ. వైరిబాధల కలసి, మాభరతమాత
దుఃఖమునవేడ్చు నేడ్పులతోడ మిగుల
నిండి నిబడీకృతమ్ములై యుండునాదు
శ్రోత్రములు పికరవంబుల జొక్కునెట్లు.

రోష—అయ్యో ! మనోహరా ! యెంతదూరము నీకుఁ జెప్పఁగలుగుదును ? ఇంకను దయరాదా ? అక్కటకటా ! ఆలోచించి చూడగా—

గీ. ఉఱుములు భయంకరమ్ముగా నుఱుమనిమ్ము
పిడుగు లొక్కొక్కటియె మీదఁ బడగనిమ్ము
ఇంచుకైన జలింపదో హితుడ నీది
మానసము లేక పాషాణమా ? వచింపు.

శివా—అగునగు. నాహృదయము పాషాణసదృశమే. ఈ సంగతిని దెలిసికొంటివి కావున నికనైన మాయసంబద్ధప్రసంగమును మానెదరని నాతలంపు.

రోష—ఇదుగో, మనోహరా ! ఇనన్నియు మనస్ఫూర్తిగా నాడుచున్న మాటలేనా ?

శివా—ముమ్మాటికిని.

రోష—నామాట వినవా ?

శివా—వినజాలను.

రోష—అక్కటకటా ! ఇంతటి మొండితనమా ! ప్రియుఁడా ! ఇకనైనఁ బ్రసన్నుఁడవుకారాదా ? ఇదిగో, ఈసౌందర్యము నీసొమ్ము. ఈ యౌవనము నీహక్కు. ఈహృదయము నీబానిస. ఇంతయేల నాప్రాణములనైన నీకొరకర్పింతును. నన్నేలుకొమ్ము మనోహరా ! నన్నుఁ బరిపాలించుకొమ్ము. గృహస్థుఁడవగుటచే శంకించుచున్నావేమో ? వద్దు. నీభార్యలకందఱకు ననువర్తినినై వలయునెడ వారి పాదములుకూడ నొత్తుచుండెదను. ఒకవేళ, బరమతస్థురాలని యెంచుచున్నావేమో ? మనుగడకు మతముకాని, మనస్సునకు మతమేమి ?

మతము మనుజనిర్మితము. హృదయము ప్రకృతినియమితము. రెంటి కిని సంబంధమేలేదు. కావున నన్ను నిరసింపకుము—దుస్తరవిరహాబ్ధిని ద్రోయకుము. నీవే నాకుదిక్కు—నాపతివి—నాజీవమవు —దైవమవు నీవెయగవుకాని, నాథా! ఆనాడు ఢిల్లీకేగుదెంచి రాజసభామందిర మున నాసోదరునియెదుట నీవు నిలచియుండినపుడు నిన్ను తొలుదొల్త జూచియుంటిని. అయ్యయో! ఆమొదటిచూపులే యింతచేసెగదా! ఆనాడు మొదలొకని నీవిశాలనేత్రములను నీసుస్నిగ్ధగండ ఫలకము లను, నీదరహాసితవదనమును, నీక్షత్రియవర్చస్సును, నీఠీవిని స్మరించు కొనుచు, నామనోదృష్టియెదుట నీదివ్యమంగళవిగ్రహమును నిలువం బెట్టుకొని నావలపుమొలకను భాష్పబిందువులవోసి యాశాదోహదముఁ జేసి పెంచుచుంటిని. నాథా! నాథా! ఈమోహము నికభరింపఁ జాలను—జాలను! నన్ను నీకౌగిటఁ దీసికొని ఈపరితాపము నపన యింపుము! రమ్ము—రమ్ము.

శివా—(11) ఇక నేనిచ్చట నుండరాదు. ఉన్నకొలదీ యీ యున్మాదిని యిట్లే చెలరేగుచుండును. (ప్రకాశముగా) రోషనారా! మీయెదుటనుండుట నాకిక దగదు. ఇదే పోవుచున్నాను.

రోష—ఆ! ఏమి! పోయెదవా? పోయెదవా? మాట్లాడ వేమి?

శివా—రోషనార! ఇదిగో, మాట్లాడుచున్నాను వినుము— కడసారివినుము. మీరు నాకు మాతృసమానులరు. మిమ్ము నేనెన్న డును మోహించియుండలేదు—ఎన్నటికిని మోహింపఁబోను! ఇందు లకు దైవమేసాక్షి! సత్యము. సత్యము. సత్యము.

రోష— హా! హతోస్మి! హతోస్మి! (మూర్ఛిల్లును.)

శివా—(తనలో) ఈమె—పాపము! మూర్ఛనొందియున్నది. పోయి సైత్యోపచారపరికరములతో దాసీని దీసికొనివచ్చెద.

(నిష్క్రమించును.)

రోష—(కొంతవడికిఁ దెలివినొంది) మనోహరా! మనోహరా! మాట్లాడవేమి? ఎచ్చటనున్నావు! (లేచి గదియంతయు వెదకుచు) అయ్యో! ఎచ్చటనున్నాఁడు! ఏడీ! నామనోహరుఁడేడీ! నాపెన్నిధి యేఁడీ! (12) (అనుచు ప్రక్కనున్న యుపవనములోనికి నిష్క్రమించును.)

## ద్వితీయాంకము—రెండవరంగము.

(ఉద్యానవనము.)

రోష—ఈయుద్యానవనమునగూడ లేఁడే! అక్కటా! ఇక నన్నుఁ జూడరాఁడా?

మత్త. కట్ట! డెందముఱాయిజేసితె? కాంతుఁడా! యికనిన్ను నే
డిట్టునిట్టననేల నాదురదృష్ట మీవిధినుండగా,

(రామోజీ ఈక్రిందిచరణములు చదువుచు ప్రవేశము)

వట్టిమాయల పుట్టినిల్లగు వానిపై ననురాగమున్
బెట్టుకొన్న నికెట్టిసౌఖ్యము నీకుఁజేకురు సుందరీ!

రోష—ఇదేమి? ఔరా! నీవెవ్వఁడవు?

రామో—నేనెవ్వఁడనో తరువాత జెప్పెదను—కాని, దుష్ప్రవర్తకుఁడగు శివాజీమీఁదమాత్రము నీవు భ్రాంతిని బెట్టుకొన్నయెడల నెందునకును బనికిరావని నొక్కివక్కాణించు చున్నాను వినుము.

రోష—ఓరీ! అసంబద్ధప్రలాపీ! ఈమహితబోధల నొనర్చుమని నిన్ను నేను బొట్టుకాటుకలువెట్టి పిలిచియుంటినా! బుద్ధికలిగి పోపొమ్ము.

రామో—రోషనారా! నీసంగతి మాకు తెలియనిదికాదు. ఇంతకుబూర్వమే నీవు శివాజీతో నాశయ్యామందిరమున నేమేమి ప్రసంగించి యుంటివో సర్వమును నేనాప్రక్కనుండి యాలకించియే యుంటిని. అది యట్లుండనిచ్చి నేనెవ్వఁడననికదా నీవిందాఁక నడిగి యుంటివి. నాపేరు రామోజీ. మహారాష్ట్రుఁడను. శివాజీ సైన్యమునం దొక సేనానాయకుఁడను. మఱియు,

గీ. పొలతి నినుగన్న దాదిగాఁ బుష్పశరుఁడు
హృదయమును గాడనేసె తా నదయుఁడగుచు
వార్ధకత మ్రొగ్గుచున్న శివాజియేల?
నన్నుఁ జేపట్టి సుఖముల నెన్నరాదె?

రోష—ఓరీ తుచ్ఛా! ఏమని ప్రేలుచున్నావు? ఏమైన మద్యమును ద్రావి వచ్చితివా!

రామో—ఔను అందబద్ధమేమి!

ఉ. మానిని! నీవిలాసమను మద్యము ద్రావి మదించియుంటి! నీ
యాన, నిజంబుసుమ్మి! పరిహాసమటంచు తలంపఁబోక, మో
హానలకీలికోజ్వలిత మై తపియించెడు నాదు డెందమున్
జానరో! జాగుసేయ కిక చల్లనిమాటల శాంతిజేయవే. (13)

రోష—ఓరీ త్రాగుబోతా! ఏమి నీకండకావరము? పుట్టెడు వగపుతోఁ బొక్కుచు బరునికంటఁ బడకుండ యీాయుపవనమున ద్రిమ్మరుచు ప్రొద్దుపుచ్చుచున్న నన్ను నోటికి వచ్చినట్లు తూల

నాఁడుచున్నావా? జాగ్రత! శ్రీశివాజీప్రభువు నీకు తగినబుద్ధి చెప్ప గలఁడు.

రామో—ఓసిటక్కులాఁడీ! తాటియాకు చప్పుడునకు కుందేళ్లు బెదరునా? నీవు బుద్ధి చెప్పించెడుదానవు, శివాజీ బుద్ధిచెప్పువాఁడునా!

ఉ. బుద్ధులుసెప్ప వాఁడెవఁడు బోఁటిరో! నీమగఁడా? ఇటేల నీ
సుద్దిని వెల్లడించెదవు? చోరుఁడు జారుఁడు ఘోరహంతకుం
డద్ధరణీశ్వరుండె విటుఁడా యిటుడాయుగ? నేనుకాన?

(అనుచు కౌఁగలించుకొనబోవ)

రోష—......................................ఓ
క్రుద్ధుడ! యూగుమాగు మిదిగో! (మొలనుండి బాకు పెఱికి) మగ
వాఁడవయేని కాచుకో!

రామో—(ఆశ్చర్యస్తబ్ధుఁడగును.)

రోష—మగరూపమునను్న నోయాఁడుదానా! రావేమి ఈ బాకుతో నొక్కపోటైన దినకయే నాయట్టిదాని పరిరంభణము నీకు లభించుననుకొంటివా! నేను భోగమతొత్తునుకాను—వీరవనితను. (14)

శివా—(ప్రవేశించి) ఇదేమి! ఈయాగడమేమి? వీడిచ్చటికెట్లువచ్చె.

రామో—(భయవిస్మయములతో) నాకొంప ద్రవ్వుకొంటిని కదా!

రోష—యేమియున్నది! (బాకు నొఱలోనిడుకొని) ఓరాజా! నీకొఱకు వెదకుచు నేనీయుద్యానవనికి వచ్చియుండఁగా వీఁడెదురై

మూఢునివలె_మదోన్మత్తునివలె_నన్నునరాని మాటలని మీాద పడ బోయెను. మానసంరక్షణార్థమై నాబాకుదీసి పొడవంబోతిని.

శివా—ఔరా! రామోజీ! నీచా! తుచ్ఛా! మ్లేచ్ఛా! ఎంతరాక్షస కృత్యమునకు సాహసించితివి? ఢిల్లీచక్రవర్తి యంతవానికి సోదరియు నాకు మాతృసమానయునగు నీనారీమణిని—శుద్ధాంతకాంతను_కనులెత్తి చూచుటకైన శంకింపవలసిన నివు నిశ్శంకముగా బల త్కారించుటకే సమకట్టితివా? ఎంతమోసపోతిని? ఓరీ కృతఘ్నుడా! దిక్కులేక ద్రిమ్మరుచున్న నీకు అన్నమిడి వస్త్రములిచ్చి క్రమక్రమ ముగా నున్నతపదవులనిచ్చి తుదకు నాసైన్యమునం దొకసేనానాయకు నిగా గూడఁ జేసియున్న నామేలు నెల్ల మఱచి, నాసంరక్షణముననున్న యబలను, నాయుద్యానవనముననే నాకన్నులేగప్పి చెఱబెట్ట సాహ సించితివా? రాజద్రోహీ! మహారాష్ట్రకులపాంశనా! నిన్నుజంపి నాసైన్యమును నిష్కళంకముగా నొనర్చెదగాక, భావానీ! హర్ హర్ మహాదేవ్! (కత్తిదూసి తలవ్రేయఁబోవును).

రోష—(అడ్డుకచ్చి) ఆగుఁడు! ఆగుఁడు! ప్రభువరా! ఆఁడు దానికన్న నబలుఁడైన వీనిని జంపుటకు మీా భవానీయట్టి యమోఘ ఖడ్గము కావలెనా? ఖడ్గమక్కరలేక చీమనునలిచినట్లు కాలితోఁ బాచి వీనిని కడతేర్చవచ్చును. ఇంతయేల? చంపవలెననియున్నచో నాబాకు తోనే నిందాఁకనే పొడిచియుందును. శాంతింపుఁడు, శాంతింపుఁడు. నావిన్నపమాలించి వీనిని జీవములతో విడిచిపెట్టుఁడు.

శివా—(కత్తి నొరయం దిడుకొని) అమ్మా! శాంతించితిని. ఓరీతుచ్ఛా! వింటివా! బ్రతికిపోతివి కాని వినుము. ఈక్షణము మొదలుకొని నీకు మూడుదినములు వ్యవధి నిచ్చుచున్నాను. ఈ వ్యవధికాలములో నీవీ మహారాష్ట్రపు సరిహద్దులనుదాటి యేపరదేశ మునకైనను పోవునది. అట్లుపోవక నాల్గవనాటి సూర్యోదయానంతర

మున నాయీరాజ్యమునం దెచ్చటనైన గాన్పింతువా నీతల నీభుజముల మీాద నుండఁబోదు. ఇదినాయాజ్ఞ. పోపొమ్ము. (పండ్లు పటపట గొఱికికొనుచు రామోజీ నిష్క్రమించును.)

శివా.—నారీమణీ! మీాధైర్యసాహసములకును దయాదాక్షిణ్యములకును మిగుల సంతసించితిని.

రోష.—అటులైనచో నన్నుకనైనఁ గనికరింపరాదా?

శివా.—అక్కటా! మరల మొదటికవచ్చిరా; దైవసాక్షిగా నేనొట్టిడినసంగతి నెల్ల మరచితిరా?

రోష.—అయ్యో! మనోహరా! నీవు వట్టి యమాయకుఁడవుగా నున్నావు. నన్ను చేపట్టినయెడల నీకెట్టి ఘనలాభములు సమకూడునో యెఱుంగకున్నావు. నాసోదరుఁడగు నౌరంగజేబు పేరునకు మాత్రము పాదుషా. అతని రాజకీయతంత్రములన్నియు నాచేత నున్నవి. నాహితము నడుగనిదే యాతఁడేయుద్ధమునుగాని, యేసంధిని గాని లేక మరేయితర రాజ్యకార్యమునుగాని, చేయఁడు. కాని నీ ప్రేమకొఱకు, ఆనాసోదరునిఁగూడ యవగణించి మొగల్ సామ్రాజ్యమునంతయు మూఁడుదినములలో నీచేయియందొలిచి పెట్టెదను. గ్రహించితివా? బాగుగా నాలోచించుకొనుము.

శివా.—ఆలోచన మనవసరము. ఆఁడువారిమూలమున రాజ్యములను నార్జించుకొనవలసినదశ మా మహారాష్ట్రులకింకను పట్టలేదు.

రోష.—(15) కడసారి వేడుచున్నాను వినుము. ప్రియా! నాథా! మనోహరా! వినుము. బాగుగా నాలోచించుకొనుము.

సీ. మంత్రినై మొగలసామ్రాజ్యమునెల్ల గ్ర
హించి నీకొసఁగి యర్పించుదాన

బంటునై దక్షిణాపథము సర్వంబు నో
డించి సీమాక్కు గావించుదాన
రక్షకినై నిన్ను రవియంటకుండ నా
తలవెంట్రుకలనీడ దాచుదాన
ప్రేయసినై నిన్ను ప్రేమతరంగడో
లికలఁ దేలించి లాలించుదాన

గీ. వేశ్యనై క్రీడలందు మెప్పించుదాన
బత్నినై కష్టసుఖములఁ బడయుదాన
నాథ ! నా ప్రాణనాథ ! విరోధముడిగి
బ్రోవవేయింక గాళ్ళంటిమ్రొక్కుదాన ! (మ్రొక్కును.)

శివా—(వెనుకకు తగ్గును.)

రోష—(అట్లే యుండును.)

శివా—(తనలో) ఆహా ! ఏమిచేయుదును ; ఏమిచేయకుందును అవ్యాజమగు—అపారమగు—అకళంకమగు ననురాగమున నన్నీమె కోరియున్నది. అనన్యసామాన్యశక్తిమతియై తన యనురాగదేవతను మాతాభిమానమును సోదరప్రేమను మీదుమిక్కిలి [illegible] సామ్రాజ్యమునుగూడ బలిగానీయ సంసిద్ధురాలై యున్నది. నన్ను తన బాహువులలో నిడుకొని జోకొట్టుచు, నాపక్షమున నా సేతు హిమాచలపర్యంత భూఖండమునెల్ల నిర్వక్రప్రజ్ఞతో పరిపాలింప సముద్యుక్తురాలై యున్నది. ఇంతయేల ? ఈ పెమూలమున స్వరాజ్య పునరానర్జపునరుద్ధరణములసంబడు నా ఘనసంకల్పములు నిరాయాసముగ సమకూరఁగలవు. దాన నాజీవితము ధన్యత నొందగలదు ! కాదు కాదు ! హృదయమా !—హృదయమా ! మందమతివిగాకుము !—వివేకమా ! పిఱికితనము నొందకుము !—క్రోధమా ! తలయెత్తకుము!

స్వశక్తిచే నార్జింపఁబడవలసిన స్వరాజ్యమును, నబలామూలమున నార్జింపనూహించుటయా? ఏకాంతను ప్రేమింపలేకుంటినో, యాకాంత యెడ కపటప్రేమనునటించి, యాప్రేమకు ఫలముగా మొగల్ సామ్రాజ్యము నపేక్షించుటయా? ఎంతినైచ్యము! ఎంత హైన్యము! భరత ఖండమేకాదు, పంచమహాఖండములెల్ల నాకు లభింపనున్నను ఈకాంత నాకు వలదు—వలదు. స్వశక్తిచే నాజీవితకాలమున నాస్వరాజ్యమును సాధింపఁగలుగుదునా ధన్యుఁడనేయగుదు. సాధింపజాలకే గతింతునా నాసోదరులు—కోటానుకోట్లు హైందవులులేరా! భరతభూమి— పృథ్వీరాజు ప్రతాపసింహ శ్రీకృష్ణదేవరాయ రాజసింహ ప్రభృతి మహాదేశభక్తులనుగన్న భరతభూమి—నాతో వట్టిపోవునా? అజ్ఞానము అజ్ఞానము. ధన్యోఽస్మి ధన్యోఽస్మి. (ప్రకాశముగా) మోహినీ! నన్నాకర్షింపకుము. నానిర్మలహృదయమును కలతపెట్టకుము. నాదృష్టి పథమునుండి తొలఁగిపొమ్ము. నీవునాకు దల్లివంటిదానవు. ఇది నిశ్చయము! నిశ్చయము! నిశ్చయము! ఇదే పోవుచున్నాను. భవానీ— పాహిమాం! పాహిమాం!

రోష—(దివాలునలేచి శివాజీకి నడ్డమునిలిచి) ఛీ! ఛీ! పోవ నుంటివా? ఎంతబ్రతిమాలుకొనిన, నెన్నియాశలు చవిజూపినను అవ్వంతయైన జెవినిడక పోవనుంటివా? నాజగన్మోహన లావణ్యమును జూచియు, నాయవ్యాజానురాగమును దెలిసికొనియు, నావలన నీకు గలుగనున్న నపరిమితలాభముల నెఱుంగజాలియుఁగూడ నన్ను గడ్డి పోఁచకునైన విలువఁజేయకుంటివా? నాతలంపులను భగ్న మొనర్చి తివా? నాహృదయమును నీ నిరసనమను అంపమునఁ గోసితివా? నాజీవితమును నాకుఁ జేదొనర్చితివా? ఔరౌరా! ఇంకేమున్నది? ఏమిచేయుదును? ఓసౌఖ్యమా! నీకును నాకును నేటితోసరి! ఓయను

రాగమా! నన్ను సత్వరము విడచిపొమ్ము. ఓ ద్వేషమా!—ఔను—ఓ మధుర మధుర ద్వేషమా! నాయందకు రమ్ము. రా! నాయనురాగము నిదే విడిచిపెట్టుచున్నాను. భయపడకుము! అనురాగవిషయిక ప్రసంగము నిఁక జేయఁబోను. కాని యిటువినుము. ఇంతకుబూర్వము నీయెడ నెంతసహ్యాత, యెంతమక్కువ నొందియుంటినో, యిపుడంత యసహ్యాత నంతమాత్సర్యము నొందియున్నాను. ఇంతవరకు నిసర్గమనోహరములై జగన్మోహనములై కనుపించిన నీపీరసుందరతావిలాసములిపుడు ఘోరపిశాచవికారములవలె గన్పించుచున్నవి. ఓ భూపతీ! ఈనా ఘోరద్వేషమునకు గుఱివై నందులకు గడగడ వణంకుము. నే నబలను—కాన నిన్నేమియు జేయఁజాలనని యెంచితివేమో! పొఱపాటు. పశక్తిసామర్థ్యముల వినియోగించి నీకు మొగల్ సామ్రాజ్యమునెల్ల నార్జించి యీాయవలె ననుకొంటినో, వానినే వినియోగించి నిన్ను, నీకుటుంబమును, నీరాజ్యమును వేయేల! నీసర్వస్వమును విధ్వంసమొనర్చి నాపగను—నాద్వేషమును—నాపరాభవాగ్నిని—శమింపజేసికొందును. ఇది నాఘోరప్రతిజ్ఞ. అల్లా దీనికి సాక్షి. నేనిఁక నిదే పోవుచున్నాను.

శివా—అమ్మా! ఎచ్చటికి బోయెదరు? పల్లకి సిద్ధము జేయించెద, నొక్కఘడియవఱకు నాగుఁడు.

రోష—ఘడియకాదు—అర్ధఘడియ—అర్ధనిమిషము — తుదకు త్రుటికాలమాత్రమైన నే నిచ్చట నుండజాలను. మోఅజీమునొద్దకిదే పోవుచున్నాను. అల్లాదీన్! (నిష్క్రమించును.)

శివా—(విస్మితుఁడగును.)

యవనిక జారును.



# తృతీయాంకము.

## ప్రథమరంగము—అరణ్యసీను.

(రజాక్ దావూదులు ప్రవేశము.)

రజా—(16) (బుడ్డిలోని సారాయము ద్రావి తూలుచు) భాయి! దావూద్! హాకాషముం బూమి సెట్టుల్ గుట్టల్ సబ్ గిర్ గిర్ తిర్గుతున్నాయ్ క్యాబే?

దావూ—రే! బబ్మాష్! దారూహాంతా తాగియేస్తున్నావ్ లాగ హుంశాన్. హేదీ! హేదీ! హిల్గాఫిరాయించు! (తీసుకొని) షహబాష్! హిదిచూస్తే నూనెకాపానీమాఫల్ జల్ జల్ మెరుస్తున్నాయ్. దీన్కినాం అంజూర్ కాసారావాలాహుందీ, వారేవా! హిది హిరాజ్జెంలోకి తెల్లోడు దిగుమత్ సేస్తున్నాయ్ంహిన్నాహా తెల్లోడి రాజ్జెం వచ్చిందితో సారాయి పీపాల్సే తానం హాడ్వాలాం హుద్దేషం (త్రావుచున్నాడు.)

రజా—బహుత్ అచ్ఛాహై, భాయీ! ఔర్ హొక్టిదఫా బుడ్డీ దేదేవ్! (తీసుకొని) ఆ తెల్లోడి కమామిష్ తుంకూ కైసా తెల్సిందిరే?

దావూ—సునో ఈ షివాజీకారాజ్జెంసే ఏక సూరత్ నగర్ హై హాక్డాఫెరంగి బుడతకీచ్ అంగ్రీజ్ ఏసబ్ లోక్ గిడ్డంగుల్ హుంచి హున్నార్, ఆల్కిసే ఏక్ బుడతకీచ్ అద్మీకి తీన్ బర్షమైనౌకర్ సేసి హున్నాయ్. హాపూహా తమాషా సబ్ దేఖ్ లియా.

రజా—(ఊఁకొట్టుచు త్రావుచుండును.)

దావూ—మైఅల్లా! మంచీశర్బ్రా లేక గఁడగుడా తాగిపస్తున్నాన్? బాప్రే! ఆదాబుడ్డి హాఁకర్ శేసావ్. హాంకూ దేదేవ్? దేదేవ్. (లాగుకొని మిగిలిన సగమును ద్రావును.)

రజా—దావుద్? పైసాపాపం. భార్యా భారం. దారూం హోర్కీ తకరార్ లేఁదీ. అటి పఱుఁటే హాన్ని ఉన్నాయ్. (17)

దావూ—(మత్తుచే దూలుచు) హై. హై. రజాక్! దారూ యేసి సాలామస్నీ హామ్మెరుపూనిందీ హాఁడంగిలాగ తూలిపోతాయ్ నాకీకడవల్ కడకల్ కల్లుతాగినా కాల్లుసేతుల్ ఖడేగావ్ తోఁడాహేనా తూలిపోన్.

రజా—భాయీ! హోళ్లూమర్నీ హుషార్ సేస్తున్నావు కైఫు వేసింది కావాలా కపడ్దార్!

దావూ—కపడ్దార్? కపడ్దార్ కోన్హై? హాఁ! హాఁ తెల్సిందీ. కపడ్దార్ జామాదార్ సుబేదార్ హాన్నాతమ్ముల్హై.

రజా—రే! భాయీం! గ్యాపాక్ సేహుషార్ కరోరే! పెర్, పంచక్ మర్నీపేల్తునావ్.

దావూ—పేల్తావుండాన్? దూ. దూ. పేల్తే గుండూపెట్టి పేల్చియేశేయ్ హి హ్హి హ్హి! (పిచ్చినవ్వునవ్వి) పేలూఅంటే తల్లో పేలు. తలాఅంటే శిలా. శిలాఅంటే శంబు. శఁబూఅంటే సిరా. సిరాఅంటే చింతాపండు. హు హ్హు హ్హు (అని దగ్గుచు పడిపోవును.)

రజా—రే! అల్లా హీండిక్క ఫడ్గియా. హిక్డానిలిప్తే హికమత్ నైహై. పానీలో కష్డాతడ్పీ హీండిక్క నెత్తికొట్వాల నైతో సచ్చిపోతాడ్. (నిష్క్రమించి వేగమ మఱల ప్రవేశించి తడిగుడ్డతో వాని తలనొత్తుచు) రే! భాయీ! దావూద్! ఉటో! ఉటో! మైరజాక్ హై.

దావ్రా—(ఒళ్ళువిరుచుకొనుచు లేచుచు) అబ్బా! ఉత్సాహం భాయీ! కొంచెం నిద్రాహైనా ఘూప్పగాపట్టిందిబే.

రజా—బాప్రే! ఉస్తరప్ దేఖో! ఏక్యాహై! దూరంసే హాషేట్టుల్కి నడుంగా హేక్ షైతాన్‌లాగా కదుల్తాదీ దేఖో!

దావ్రా—(ఆదిక్కు పరీక్షించి) ఏక్ మన్ని మాఫక్ హుండాదిరే!

రజా—హై హై. ఆమన్నికా లుంగీ కావాలా గాల్కి హాడ్తుండాది.

దావ్రా—రే! రే! దేఖో. దేఖో. హాడ్వాడ్‌లాగా హుందిరే.(18)

రజా—క్యా? హాడ్వాడ్? (బాగుగా పరీక్షించి) బాప్రే! తుం బోలిందీ సచ్ హై?

దావ్రా—అచ్ఛా. రజాక్! హుషార్ కరో, హాడ్వాడ్ వస్తు న్నాడ్ మన్కి ఆకంచెల్కినడుంగా నక్కియేసి దీన్కి తమాషాసెద్దాం ఆవో.

రజా—అచ్ఛాహై. దీన్కి పట్కోని నగల్‌గిగల్ తీస్కోని బుడ్లుకొందాంబే!

దావ్రా—భహుత్ అచ్ఛాహై. ఆవో! (ఇరువురు నిష్క్రమింతురు.)

(రోషనార ప్రవేశము.)

రోష—

సీ. భూరికంటకశిలా భూయిష్ట మీభూమి
వెచ్చనియూవిరి వెడల గ్రక్కె
కాకులు మొదలుగాఁగల పక్షిజాలంబు
నీళ్లకై తహాపడి నోళ్ళుతెఱచె

భూనభోంతరమున బొంగి సంద్రమురీతి
నెండమావులు వ్యాప్తి నెసగియుండెఁ
గొండలపై నున్న నెండుగుబ్బలయందు
నొక్కట గార్చిచ్చు లుప్పతిల్లె
గీ. బెండువడి గండురాలును బీట్లువారె
వేఁడి గ్రక్కుచు వడిగాడ్పు వీవఁదొడఁగె
బ్రకృతినెల్లెడ వేదనావికృతితోఁచె
నకట యెట్లోర్తు నిట్టి మధ్యాహ్నధాటి.

అబ్బా! అలసట హెచ్చుచున్నది. ఈ వటవృక్షచ్ఛాయ నొకింత విశ్రాంతి దీసికొందుగాక! (కూరుచుండి) ఇంకను మూఁడు దినములకా యౌరంగబాదు చేరుట? దిన మొక్క యుగముగా నున్నది. ఈయటవీ ప్రదేశము నిర్జనమైన, శకటపల్యంకాదివాహన రహితమైయున్నది. అక్కటా! (కొంచెము కోపక్రోధముల నణంచుకొని) శివాజీమాటచొప్పున బల్లకి నెక్క రాక తత్కాలిక ద్వేషోద్రేకమున నిట్టి ఏకాంత ప్రయాణమును జేయనగునా? నాధైర్యము నందు మూఁడువంతులు తగ్గినదే. అయ్యయో!

చ. అనుపమమై జగద్వినుతమైనమదీయసురూపతాశత
ఘ్నిని గుఱిపెట్టి లీలలను నిద్దపుగుండ్ల నమర్చివానితో
వెనుకయు ముందు నారయక వెంబడి వెంబడి నెంతముట్టడిం
చినను శివాజీమానస మజేయపుఁగోటకదా కటా! కటా!

నామనోహరుని, నాప్రాణప్రియుని, నాపెన్నిధిని, నాప్రభువును, నాదైవమును యీజీవములుండునంత వరకు నెట్లు మఱువగలుగుదును! ఏమి! ఛీ! ఛీ! అంతయు మఱచి మఱల నిట్లు బేలనైతినేల? వానిని—నాయనురాగహంతకుని—నాసౌఖ్యపరిహర్తను—నాహృదయ విచ్ఛేదకుని ద్వేషతరభావమున నెంచు చుంటినా? ఓరాజా!

నిన్నీ ప్రపంచమునందు నీసౌధములకు, నీభోగములకు, నీభార్యల పరిరంభణములకు విడిచి, నేను భగ్నాశనై చత్తుననుకొంటివా ? నేన్నిచట ఘోరకాంతారవల్మీకములయందు జిక్కుకొనియుండ నీవు నీభార్యల యాలింగనముల జిక్కుకొనియుంటివి కాబోలు. నాపెదవులిచట యెండ వేఁడిమికి నెండిపోవుచుండ నీయధరము నీపత్నుల యధరామృతమున దడుపఁ బడుచున్నది కాబోలు ! నేను నాభగ్నజీవితమున కిచట దుఃఖాశ్రువులు రాల్చుచుండ నీవు నీప్రియకాంతల సయ్యాటల మునింగి యానందబాష్పమును రాల్చుచున్నావుకాఁబోలు ! హా ! నాదేహము మండిపోవుచున్నది. నాహృదయము అంపములచే గఱగఱ కోయఁబడుచున్నది. నామెదడు నిప్పులు ప్రేల్చినట్లు కాల్చుచున్నది దుస్సహము ! దుర్భరము ! దురంతము (తెరలో కాలిచప్పుడగును) [ఉలికిపడి యాదిక్కుజూచి] అయ్యో ! దైవమా ! దొంగలుకాఁబోలు వచ్చుచున్నారు. ఇంకేమిదిక్కు ?

(రజాక్ దావూదులు ప్రవేశము)

రజా—మాకీ దొంగల్ కాదూబే !

దావూ—మాకీదొరల్ హై.

రజా—(తనలో) వారేవా ! బడిహాందంపందంసే సెందుర్కీ సమంగా హుందీ. దీన్కి నగల్ నాకీహెందూ్కా ? దావూద్‌కీ తెల్వాకుండా దీన్కి నికా పేస్తాఁ.

దావూ—(తనలో) రే ! రే ! హిందీ పేరీలాగహుంది. (19) అల్లా. దీన్కీ సూసిందీతో హాంభ్యాఅంతా కారం రాసినట్టు జర్ జర్ హైంతాది. రజాక్కీ సెప్పాకుండా దీన్కి మై నికా పేస్తాం.

రోష—(తనలో) వైఖరుల నరయగా వీరు మద్యపుమత్తు మీఁకనున్నట్లున్నారు. ఇదియు నొకమేలే (ప్రకాశముగా) అన్న

లారా, దొంగలము కామనియు దొరలమనియు తెలిపినందులకు మిగుల సంతోషపడుచున్నాను.

రజా—(రహస్యముగా) రే! దావూద్. దీన్కి నగల్ నాకీ జరూర్ నైహైరే.

దావూ—(రహస్యముగా) నాకీబీ జరూర్ నైహైరే.

రజా—(రహస్యముగా) దీన్కిసూస్తేనాకీ నాతల్లికీసూసింది లాగ బుద్దిహాయింది.

దావూ—(తనలో) హీడ్కి దీన్కిసూస్తే తల్లిలాగా బుద్దిహాయింది అంట. హిది నాకీ సాలామంచి (ప్రకాశముగా, రహస్యముగా) రజాక్! నీకీ తల్లిలాగా బుద్దిహైతే దీన్కి ఛోడో, హెందుక్కంటే నాకీ నికాపేస్కొవాలీ హుద్దేషం.

రజా—(రహస్యముగా) నాకీబీ హాదే హుద్దేషం.

దావూ—(రహస్యముగా) రే! బద్మాష్. తల్లిలాగ బుద్దిహాయిందీ హన్నావ్ కాదూబే.

రజా—తల్లీఅంటే నాపిల్లల్కి తల్లిబే.

దావూ—(రహస్యముగా) రే అల్లా. హెంతా మోషం.

రోష—(తనలో) ఈ గుసగుస లేవియో నాకు మిగుల సను మానము కలిగించుచున్నవి. వీండ్రుదొంగతనమునే ప్రధానముగా జూచుకొనువారగునెడల నీగుసగుసలతోఁ బనిలేకయే తమకార్యమును నెరవేర్చుకొని యుందురు. ఒకవేళ నాసౌందర్యముచే నాకర్షింపబడి నన్ను జెఱబట్ట యత్నింతురేని యేదిదారి? వీరి కరవాలములముందు నాచిన్నబా కేమి పనికివచ్చును. [ఆలోచించి] కానిమ్ము సంగతులెట్లు వచ్చునో చూచెదగాక.

దావ్రా—(రహస్యముగా) రే. రజాక్. దీన్కి నికాసెయ్యా లాహని నాకీహుంది. నీకీహుంది. మన్కి గొండూమన్ని నాకీనాకీ అని లడాయ్‌సేస్తే దీన్కి షమయం సూసి దవ్డ్ తీస్తాదీ. మన్కి మన్కి లడాయి లేకుండా దీన్కి సెప్పి, మనరొండూమన్నిలో హెవర్ని నికా షేస్తాయ్ హడ్డుదాం. నీకీసేస్కుంటాబోత్తే నాకీసమ్మత్. నాకీసేస్కుంటాబోత్తే నీకీ సమ్మత్ పడవాలా.

రజా—(రహస్యముగా) అచ్ఛా. సదు. దాన్కి హడ్డుదాం.

దావ్రా—(ప్రకాశముగా) హోబాలా! రంగత్ వాలా! హినోక్కి మాదీగోలా.

రజా—హినోక్కి. హీడ్కిబోలేదిసబ్ మాకీసమ్మత్.

దావ్రా—[20] సునో, నీకీ సూస్తేహడ్వాడ్, హిదీసూస్తే భడీజంగల్, నీకీహిక్డా మన్నిదిక్కూలేదూ. మాకీ హిద్దర్కీబీ నీకీ మీద—సాల—సా—లా—రంగూ హైంది. హంద్కుసేతమాకీ హిర్దర్లోహెవడూగమక్ చమక్ హాందంషందం గోట్ సీట్ హుండాదో హాడ్కి పెళ్లీ సేసోక్కి, నైత్రోనీకీ నై చోడ్తా, కపడ్‌దార్! బాగా హూలోషన్ సేసోక్కి.

రజా—నాకీ నికాషేస్తే సారాపీపాల్ తానం సేయిస్తాన్. ప్యారీ! కనికారం హుండాలా హూలోషన్ సేసోక్కి.

రోష—ఆహా! నాయనుమానమే నిశ్చితమైనది. కాని యేమి దారి? వీండ్రు దృఢసంకల్పులుగాఁ గన్పట్టుచున్నారు. నేను ఢిల్లీపాదుషా సోదరిని రోషనారనని చెప్పినచో భయపడివిడిచెదరేమో? ఒకవేళ వీండ్రు నాసోదరుని రాజ్యములోనివారు గాకుండినచో నాపదవికేల భయము నొందెదరు? అదియుగాక మఱొక యసందర్భముకలదు.

నాపేరు చెప్పినచో వీండ్రు దేశమునందెల్లశ బ్రకటింతురు? ఏకాంత మాగా రాజగడప్రాంతారణ్యములందు దిమ్మరుచున్న కారణము నన్ను గూర్చిన జనాపవాదములు పెక్కులు ప్రబలును, నాసోదరుఁడే వినుట సంభవించెనేని మిగుల నపాయకరమగు. కావున నొక్కటే మార్గము. కలసుకొన్నను కత్తికన్నను వాడిగల సౌందర్యాయుధము నాయొద్దనున్నది. దైవదత్తమగు నీయాయుధము చేతనే పని నంత మొందించవలయు.

దావ్రా—క్యాహై? ప్యారీ! హమ్రోషన్ హుయిందీ లేదూ బోలో.

రజా—జరూర్ సే బోలో.

రోష—యువకులారా! మీరెవ్వరో నేనడుగవచ్చునా?

దావ్రా—హా! నాకీ సాదాఅద్మీ నైహై. గోల్కొండా దివాన్ హై.

రజా—హిడ్కి దివాన్ కాదు—దివానాహై. ప్యారీ! నాకీ మాత్రం నిజంగా భీజపూర్ సుల్తాన్కా భాయిహై.

రోష—కాని, మీరిరువురకు నాపై నింతటి ప్రేమకలదా?

రజా—పెర్మా! బాప్రే! నీకీ యిడిస్తే నాకీ బతక్ లేనూ ప్యారీ!

దావ్రా—నాకీ నీ సిన్ని మూతి సూసిందితో దాటిబెల్లంతిన్నట్లు నోరుహుంత హూటల్ హూరిందీబాలా! (21)

రోష—సరే. యువకులారా! మీయిరువురలో నే నీ రజాకు నెన్నుకొన్నాను.

రజా—నాకీ? నాకీ? రే అల్లా! హెంతాహర్దుష్టం. దేఖో ప్యారీ! హూక్కోముద్దు దేదేవ్! (22) (సమీపింపబోవ)

రోష—ఆగుమాగుము. పొరపాటు. ఓయీ దావ్రూద్! నీయందమును బాగుగా జూడనిమ్ము. అగునగు. వానికన్ననీవే బాగుగానున్నావు. వానినికాదు నిన్నే నేనెన్నుకొన్నాను.

దావ్రూ—నాకీ? నాకీ? అల్లాహో అగ్బర్! బాలా! బాలా! ఆవ్ ఆవ్! ఇదరావ్! (23) (అని రోషనారను సమీపింపబోవ)

రజా—(అడ్డుపడి) క్యారేబద్మాష్! మొట్టామొదట నాకీ హడ్గిందీ తుంనై దేఖా క్యా?

దావ్రూ—క్యారే జబర్దస్తీకర్తాక్యా? నీకీ మొహం హైతాన్కా మొహంలాగ హుందీ అని నీకీయిడ్సీ నాకీ హడ్గింది.

రజా—ఏ దేఖో దాన్కీ యిదుస్తాయ్ నైతో నీకీనాకీ లడాయ్ హైతాది. కబడ్దార్.

రోష—అయ్యో? దావ్రూద్! పిటికిజెందికాని, నిర్దయుండవైకాని నన్నా కురూపిబారికి విడిచెద వేమోసుమీ! నిన్నే నమ్ముకొని యున్నాను. [అనిదావ్రూదుచాటున నిలుచుండును.]

రజా—క్యాబే వగలాడీ! నీకీదేఖో. ఈడ్కీ హజామత్ సేసి మాకీ నికాహేస్తాం.

రోష—అయ్యో! దావ్రూద్! నాకింకేదిదిక్కు? నన్నువిడిచెదవా? ఈక్రూరుని మదమణగింపరావా?

దావ్రూ—ప్యారీ! తుం మత్ ఢరో ఫీకార్కా జరూరీనహీంహై హీడ్కీ పుచ్చల్ హాంతా పచ్చడీ సేస్తాందేఖో.

రజా—క్యా! నాకీపచ్చడిసేస్తావ్? మైతయార్ హుం లడాయ్కే. ఆవ్ రే సాలా! [కత్తిదూయుచున్నాడు.]

దావ్రూ—నాకీబి తయారు హుం ఆవురే కాఫీర్! ఆవ్ [కత్తిదూయుచున్నాడు.]

రోష—[తనలో] ఇంద్రోక్కరుఁడు చచ్చినచో రెండవవానికి దగిన శాసి చేసెదను.

రజా—ఏ దేఖోరే మైమజా !

దావ్రా—మైమజాబీ దేఖోరే హైవాన్ !

(ఇరువురును సాముచేయుదురు.)

దావ్రా—ఏ దేఖో హీందెబ్బతో హాజామత్ ! (పొడుచును)

రజా—రే అల్లా ! మై మర్‌గియా. (పడిపోవును)

రోష—(తటాలున రజాక్ ఖడ్గమును లాగుకొని) ఓరీతుచ్ఛా! ఇంక నెందుపోయెదవు ? నాయొద్ద ఖడ్గముండినచో మీయిరువురఁగూడ యిదివఱకే యల్లా సముఖమునకు బంపి యుండెడిదానను. రమ్ము. నిన్ను వేయి వ్రక్కలుగా నఱికి కాకులకును గ్రద్దలకును విందు గావించెదను. రమ్ము.

దావ్రా—రే షైతాన్ ! హెంతా మోహం ! హెంతా మోహం ! నీకీ ముక్కల్ ముక్కల్ సేస్తాన్ దేఖో.

(ఇరువ్వురును సాముచేయుదురు.)

రోష—ఇదిగో బాలిసా ! నీకిది బహుమతి. (పొడుచును)

దావ్రా—హా ! మై అల్లా ! (పడిపోవును.)

యవనిక జారును.



# తృతీయాంకము—ద్వితీయరంగము.



ఔరంగాబాద్ ప్రాంతారణ్యము—రామసింహుడు ప్రవేశము.

రామ—[24] అకటా!

గీ. దుర్దమపు తిమిరంబులు తొలగిపార
నుర్వి సర్వంబునకు నదే, యుదయమయ్యె
దుస్సహపు బరాధీనత తొలగిపార
నుర్వి హిందూస్వతంత్రత కుదయ మెపుడొ?

(ఆలకించి) ఈదిక్కునుండి యేదియోశబ్దము వినవచ్చుచున్నట్లున్నది. (పరీక్షించి) ఓహో! ఎవ్వడో యొకడు—మహారాష్ట్రుడై యుండనోపు—వచ్చుచున్నాడు.

రామో—(ప్రవేశించి, తనలో) నాకుదోడు మఱొక బాటసారి తటస్థుడైనట్లున్నాడు. (ప్రకాశముగా) ఆర్యా! తామెవ్వరో, యెచ్చటికి బోవుచున్నారో యడుగనగునా?

రామ—నేను రాజపుత్రుడను. రామసింహుడనువాడను. జయపురమునకు బ్రభువును. మఱియు మోంఅజీమునొద్ద సేనానాయకుడను. అతనిజూచుటకే యిపు డౌరంగాబాదు పోవుచున్నాను. అనుచరులు వెనుకనుండి వచ్చుచున్నారు.

రామో—ఓహో! మిమ్మిచట నాకు దటస్థింపజేసిన దైవసంకల్పము నేమనికొనియాడుదును. అయ్యా! నేనుగూడ యౌరంగాబాదునకే—మీరా మోంఅజీమునొద్దకే—పోవుచున్నాను.

రామ—ఏ పనినిగూర్చి పోవుచున్నారు? తామెవ్వరు?

రామో—నేను మహారాష్ట్రుడను. రామోజీ నామకుఁడను. శివాజీయొద్ద సేనానాయకుఁడనుగా నుండినవాఁడను.

రామ—(తనలో) ఏమి? శివాజీయొద్ద సేనానాయకుఁడైన వీనికి శివాజీకి బరమశత్రువగు మోఅజీముతో నెట్టిపని? ద్రోహము దలంచి పోవుటలేదుగదా.

రామో—ఆర్యవర్యా! మోఅజీముతో నాకుఁగలపని యిట్టిది. యెఱుంగుదురుగదా, మహారాష్ట్రరాజ్యమును మహావృక్షమునకు, రాజగడము తల్లివేరువంటిదని. అది పెళ్లగింపఁబడిననే కాని యీతని రాజ్యము సాంతముగా నంతరింపదను రహస్యమును గ్రహించి మోఅజీము తనతండ్రియగు నౌరంగజేబుచే నాజ్ఞాతుఁడై పలుసారులా గడమును ముట్టడించి యుండెఁగదా. కాని, యది యతిభయంకరమును నత్యున్నత పర్వతాగ్రస్థితమును నగుటఁ దన ప్రయత్నములెల్ల నిష్ఫలములై వచ్చినత్రోవ నాతఁడు పోవలసినవాఁ డయ్యెఁగదా! ఇంతకు, నా దుర్గమునుగూర్చిన మహారహస్య మొకటి కలదు. ఆ రహస్య మెఱింగిన శత్రుసేనాని యనాయాసముగా దానిని మూఁడు ఘడియలలో మున్నూర్వురు బంట్లతో సాధింపవచ్చును. నాసేనను మోఅజీమున కర్పించి—అయ్యా! మీ మొగము పొంగి యున్నట్లున్న దేమి?—వానికి తన్మహారహస్యము నెఱిగించి వానిచే రాజగడమును బట్టించి—తమ కనులుకూడ, యేలనో కషాయితము లగుచున్నట్లున్నవి?—నాసేనకు బహుమానముగా మహారాష్ట్రమునందలి కొంతభాగమునకు నన్ను దొరగా నొనర్ప బ్రార్థించి—

రామ—(చివాలున గత్తిదూసి) ఓరీ తుచ్ఛా! మ్లేచ్ఛా! రాజద్రోహీ! దేశద్రోహీ!

రామో—(తానుగూడ చివాలున కత్తిదూసి తనలో) ఆఁ! ఏమిది!

రామ—ఛండాలా !

చ. పగతులఁజేరసిద్ధపడు పందవు పాతకి వీవు నేనయా
తగుదని దండనాథుని విధమ్మునజేరి శివాజియన్నమున్
తెగదిని తత్కృతజ్ఞత మదిన్ వహింపక యన్నదాతకున్
వగవుఁదలంచి కుట్రలను బన్నఁగనుంటివె బానిశాధమా !

ఓరీ కుటిలబుద్ధీ ! అవతారపురుషుని—యాత్మదేశసేవాపరతంత్రుని—యా శ్రీశివాజీని యంతమొందించి యాతనిరాజ్యమునకు దొరవగుట నూహించుచుంటివా ? మదోన్మత్తా ! నీయభిమతము నిప్పుడే తీర్చెద జూడుము.

సీ. ఎత్తుగా దుబ్బుగా నెదిగిన యాముండ్ల
పొద నీకు గద్దెపగిదినెసంగ
నీచావుకై యెదురూచుచుమూఁగెడు
రాఁబందు గుములంగరక్షకులుగ
కుక్కల మొఱుగులు నక్కలకూఁతలు
బహువిధ తూర్యరావములుగాఁగ
ధర నీకుబలె నింగితములేని యీవన
జంతువు లుత్సవజనముగాఁగ

గీ. కాకిరెట్టలు చందనాక్షతలుగాక
కాటికేనవచ్చు యీవనవాటియందు
నొక్కవ్రేటున నీతల యూఁడఁగొట్టి
నరకమున కిప్డె నిన్ను పెన్దొరనొనర్తు.

రామో—ఏమి నీ ప్రగల్భములు ? ఓరీ వాచాటా ! ఇన్ని శ్రీరంగనీతులు నుపన్యసించుచున్న నీవుచూడగా ఘోరరాజద్రోహివిగా గన్పట్టుచున్నావు ! కాకున్నచో నీకధికారియగు రాజునకు మేలుగూర్పనెంచివచ్చిన నేను నీకు బగవాఁడ నెట్లైతిని ?

రామ—తులువా! నాకేకాదు—ఆత్మదేశద్రోహివగుట నఖిల భారత జనంబునకు నీవు పగవాఁడవే. ఆవిషయ మట్లుండ నాప్రవర్తనమునుగూర్చిన నీసంశయమును నివర్తించుకొనుము—నిర్భయముగా జెప్పుచున్నాను. నేను రాజద్రోహిని. మొగలుజీమునొద్ద సేనానాయకుఁడనుగానుండి వాని సైన్యరహస్యములను శ్రీశివాజీకి దెలుపుచున్నవాఁడను. తన్మూలమున దేశసేవజేయుచున్నానను నమ్మకము కలిగియున్నవాఁడను. ఇంతయేల? నేను రాజద్రోహము దలంచియుండుట స్వార్థపరతచేఁగాదు—దేశార్థముచే. ఇకనీవో,

సీ. సోమనాథేశ్వరుగీములో మైలగ
 ప్పిన హైందవమతపవిత్రతకును
స్థానేశ్వరమునందు చల్లారిపోయిన
 దేశ స్వతంత్రతా తేజమునకు
నక్బరుమేడలో హంసతూలికలపై
 గ్రుంకిన కులనిష్కళంకతకును
నౌరంగజేబుచే నామూలముగ భంగ
 పడనున్న ఘనత సర్వస్వమునకు

గీ. నేనుధీమణి జీవముల్ పోసి మరల
మనస్వరాజ్యము మనకయి మహినినిల్పె?
నట్టిదివ్యుని దేశభక్తాగ్రగణ్యు
బగతులకు నప్పగింపగఁబాలుపడిన
పరమచండాలుడవు ఘోరపాపి వీవు.

రామో—ఓరీ పరనిందాపరాయణా!

గీ. మొగలులకు సేవకుండవై మొగలుదొరల
గుట్టుమట్టుల గడు రచ్చ పెట్టుఖలుఁడ

నీవు పుణ్యాత్ముఁడవ ? పాపి నేన ? తుచ్ఛ !
మతిచలించెనె నీకు దుర్మదముచేత ?

రామ—నాకు మతిచలింపలేదు నిండుమతితో విబ్బరముగా నూహించి చెప్పుచున్నాను.

చ. వితతసుధీవిచారులను విస్తృతకీర్తుల వీరశౌర్యసం
భృతులనుగాంచిలోకమున బేరువహించిన దేశమాతకున్
రతనమువంటిగర్భమున బాయిజనించినయట్లు నీవు పు
ట్టితివి స్వరాజ్యనాశము ఘటింపగ నెల్లరపుట్టిముంపగా.

రామో—ఓరీ నీతివిహీనా ! హైందవు లైకమత్యరహితులై తమ్ము తామేలుకొనఁజాలక పరస్పరకలహంబుల మునింగి యరాజకతను ప్రబలచేసికొని, తమదేశము దోఁపిడిగాండ్రకు, దుర్భిక్షములకు, మిాదుమిక్కిలి దుష్టజాడ్యములకు దామే యప్పగించుకొన్నారు. అట్టివారిని గఠినశిక్షయందుంచి, దేశమును బలత్కారించియైన శాంతివంతముగా జేయుపాటిసామర్థ్యముగల మొగలులకు నేను సహాయమొనర్ప నెంచియున్నాను. ఇట్లుచేయుట స్వరాజ్యవినాశకర మయిన నేమి ? నాయభిమత మిట్టిది.

రామ—ఓరీ ! వంచకుఁడా ! హైందవులన్యోన్యతారహితులై యుండుటకుగల కారణము నీవంటి స్వామిద్రోహులు—కృతఘ్నులు—కొండెగాండ్రు— బిరుదప్రియులు— ప్రబలియుండుటచే. ఇంతవాగ్వ్యయమేల ? ఓపెనుభూతమా !

గీ. కుట్రయే బలకరఁబగు కూడుగాక
బలసియున్నట్టి నినుమోయు బలములేక
దీనయై మూల్గుచున్న దీ దేశమాత
పతిత ! నిన్ జంపుదిదె యాపెబరువుదీర.

[కత్తిఝుళిపించి మీాదికురుకును.]

రామో—(కత్తిద్రిప్పుచు) ఓరీ ! నీకండకావరము నణంచెద చూడుము.

రామ—మాటలకేమి ? పోటులు చూచుకొనుము.

[ఇరువురును సాముచేయుదురు.]

రామ—ఓరీ దేశద్రోహీ! ఇదిగో నీవంతు. (డొక్కలో బొడుచును.)

రామో—హా ! (అని పడిపోవును.)

రామ—పడితివా ! మంచిది. ఇక నామహారాష్ట్ర సోదరులు సుఖముగా నిదురింపవచ్చును.

గీ. బిరుదులకు జమీాలకు పెక్కువేతనముల
కాసపడి దేశశత్రులయండజేరి
యాత్మదేశంబునెడల ద్రోహంబుదలచు
ఖలులకెల్లరకవని యీాగతియెనిజము. (నిష్క్రమించును.)

రామో—హా ! బాధ—బ్రతుకను—రాజద్రోహి—కత్తి పోటు—ఈపార్శ్వము—దుర్భరము—దుర్భరము ! రామసింహుని—పరాభవించుట——ఇఁకనెట్లు ? నాద్వేషము—దీరుట——ఎట్లు ? (మూల్గుచుండును.)

(పురుషవేషధారిణియైన రోషనార ప్రవేశము.)

రోష—ఏమది ? వేదనాసూచకమైన మానవునికంఠధ్వనివలె నొండు వినవచ్చుచున్నది.

రామో—హా ! బ్రతుకను.

రోష—(వెనుకకుదిరిగి) ఇదిగో! (సమీపించి) దైవమా! ప్రక్క ఈకరవాలమేమి? ఈరక్తమేమి? (గుర్తించి) ఎంతయాశ్చర్య మెంతయాశ్చర్యము! ఆనాఁడు నన్ను బలత్కారింపబోయిన రామోజీ యీతఁడు.

రామో.—దాహము—దాహము. (కనులుమూయును.)

రోష—నాయెడ నొకప్పుడు కీడుదలంచియున్నను వీనిపై నాకిపుడుమిగుల జాలికలుగుచున్నది. ప్రక్క నొకజలాశయమున్నది. ఆకుదొన్నెయందు నీరము నించుకొనివచ్చెదగాక.

(నిష్క్రమించి, మరల ప్రవేశించి రామోజీచే నీరము త్రావించును.)

రామో—(కనులు తెరచి) హా! బాధ! బాధ! ఆ రామ సింహుడు ద్రోహి.-రాజద్రోహి—హంతకుఁడు—(కనులుమూయును.)

రోష—(తనలో) రామసింహుఁడట! హంతకుఁడట! అతఁడే వీనిని గాయపఱచియుండనోపు. వీనియుదంతమెట్టిదో తప్పక గ్రహింప వలయు. వెనుకనాయెడ నపరాధ మొనర్చియున్న వాఁడగుటచే, నొక వేళ నాతో మనసిచ్చి మాట్లాడుటకు శంకించునేమో కావున ముం దుగా నేనే మనసిచ్చి మాట్లాడుచున్నట్లు నటించెదగాక! (రామోజీని సమీపించి) రామోజీ!

రామో—(కనులు తెరచి) ఎవరుమీరు?

రోష—నేను పురుషవేషముననున్న రోషనారను.

రామో—ఆఁ! ఆఁ! రోషనారయా—పురుషవేషమా!

రోష—ఔను. ఆనాఁడు నేనెంతచెప్పినను వినక, యీ శివాజీ నన్ను దిరస్కరించినసంగతిని నీవెఱుంగుదువుకదా. అంతటిపాదుషాకు సోదరిని—తనయందంతమక్కువనొంది యున్నదానను—నన్ను అంత నీచముగా నిరసించిన యీ నరాధముని నాపగదీర పరాభవింపవలెనని

నిశ్చయించుకొని రాజగడమువిడిచి యొక్కరితను వచ్చుచుండ మార్గ మధ్యమున నెదుర్కొన్న ఇరువురు దుష్టులనుమట్టుబెట్టి, యందొకని దుస్తుల నీరీతి ధరించినవాఁడను.

రామో—అమ్మా—రోషనార—మున్ను—నీయెడ—నాఅప రాధమును—క్షమింపు.

రోష—రామోజీ ! మనస్ఫూర్తిగా క్షమించితిని.

రామో—శివాజీపై—నీకు—ద్వేషము—కలదా ?

రోష—. ఆ ద్వేషమే నాజీవముల కిప్పు డాధారభూతమై యున్నది.

రామో— సరే—నీద్వేషము—నీమూలమున నాద్వేషము— హా ! బాధ !—బాధ !—ఘోరముగా—దీర్చుకొనుటకు—మార్గ ము—కలదు.

రోష—కలదా ! కలదా·! ఎట్టి దెట్టిది ?

రామో—రాజగడమునుగూర్చిన—రహస్యము మీ మోఅజీ మనకు వెల్లడింపవలెననుకొన్న మహారహస్య మొక్కటి—ఏదీ నీచెవి. (రహస్యమునుజెప్పి)' అది. ఆమూలమునగాని—హా ! బాధ—బ్రదు కను. (కొంచెమాగి) ఆలమునగాని—యీగడమును—దాసితోబాటు —శివాజీయును—నీకులభింపరు.

రోష—గ్రహించితిని. గ్రహించితిని. మహారహస్యమును గ్రహించితిని. ఆ శివాజీ తుచ్ఛుఁడు. నాకిక నవశ్యము దొరుక గలఁడు. ఆహా ! ఎన్నఁడు మోఅజీమును గలసికొందునా—ఎన్నఁడు వానిసైన్యములతో రాజగడమును ముట్టడింతునా—ఎన్నఁడా కొండ మెలుకను బట్టుదునా-ఎన్నడు నాపగ ఘోరముగాఁ దీర్చుకొందునా—

అని మహాదాతురము నొందుచున్నాను. ఆహా! రామోజీ! దైవము దయామయుఁడై నిన్ను బ్రతికింపరాదా! నాకు గుడిభుజమవుగా నుండుటకు.

రామో—నేను బ్రతుకను — ఇంతకు — మఱొక్కటి — హా! బాధ—కనులు తిరుగుచున్నవి.—తలలో — భూతములు — యుద్ధము— చేయుచున్నట్లు—సందడి—యగుచున్నది—రోషనారా ఇంకొకటి— — యీ మోఅజీముని — నమ్మకుడు — ఆతని సేనాధిపతులను — అందును రామసింహుడనువానిని బొత్తుగా—నమ్మకుము. ఆ రామసింహుడు— మీ మొగలుల — రహస్యములను శివాజీకి చెప్పుచున్నాఁడు—హా! బాధ !—రామ (కనులు మూయును.)

రోష—అయ్యో! గతించుచున్నాఁడాయేమి. (నాడి పరిశీలించి) ఇఁక బ్రతుకడని తోఁచెడిని. అక్కటా! ఇంకెట్టి ముఖ్య వృత్తాంతముల చెప్పియుండునోకదా! ఇదే మఱల కదలుచున్నట్లున్నాఁడు.

రామో—(కనులు తెఱచి) హా! బాధ—రోషనారా— హా! రహస్యమును మోఅజీమునకు జెప్పుటకు బోవుచున్న నాకు— ఆరామసింహుఁడు ఇచట తటస్థుఁడై—నేను దేశద్రోహినని బ్రువ్వి ఈరీతి—వధించినాఁడు—.రామ! రామ! నాతుదికోర్కె—నాపేరు జెప్పి రామసింహుని—ఘోరముగా—రామ! రామ! వధింప వలెను—రామ! రామ! (ప్రాణములు విడుచును.)

రోష— ఆహా! రామోజీ! చూచుచుండగనే లోకాంతరత నొందితివా! నీ తుదికోర్కె—యవశ్యము తీర్చెదగాక.

యవనిక జారును.

# చతుర్థాంకము.



ఔరంగబాదు—మోఅజీముని రాజశిబిరము.



(మోఅజీము ప్రవేశము.)

మోఅ—(25) మైక్యాకరుం! అమారాఖజానామే హాక్సైపై సాబీనైహై. షివాజీకి జరూర్సే బందీసేసీ తీస్కరావాలఅని పాదుషా హుకుంసేసినాడ్! ఈషివాజీసూస్తే హిందుస్తాన్‌కా రాజ్‌లోక్సే భడీ రణధీర్‌వాలా హుస్నాడ్. ఈరణధీర్‌తోటి నేస్తంకల్పి పాదుషాకి లడాయ్‌సేస్తే ఢిల్లీరాజ్జం నాకీ జల్దిసే వస్తాయ్‌ంశోస్తుది. పాదుషా సస్తాడ్ సస్తాడ్ అని హెంతకాలం ధేరీసెయ్యాలా! ధేరీశూరత్‌బీనైహై. షివాజీకానేస్తంకల్పవాలా, పాదుషాకీపట్వాలా, ఢిల్లీరాజ్జం సెయ్వాలా. అచ్ఛాహై! అచ్ఛాహై! రే! షరీక్! హుక్కాలావ్!

షరీ—హాజర్ సర్కార్! (అనుచు హుక్కాతో షరీకు ప్రవేశము.)

మోఅ—(హుక్కా త్రాగుచు) షరీక్! ఏకోన్‌హైరే ఆనేవాలా!

షరీ—(తెరవంకజూచి) ఫౌజుదార్ మీర్ జుమ్లాసాబ్, సర్కార్!

మోఅ—మీర్ జుమా! షెతాక్!

(మీర్ జుమ్లా ప్రవేశము.)

మీర్—సలాం. మోఅజీమ్‌సర్కార్! హుక్కాతాగకు అండీ. గుండెల్ అంతా హెండిపోతాయ్.

మోఅ—అల్లా! నీకీవస్తే నాకీ థోడా సేపైనా కుషాల్సే తాగనిస్తావ్ లేదూ రే! షరీక్! నోరు ఆరిపోయింది. థోడాపానీ లావో.

షరీ—బహుత్ అచ్ఛాహై! సర్కార్! (నిష్క్రమించును.)

మీర్—సర్కార్! శివాజీతో లడాయ్ హోప్డు హోప్డు అని లష్కర్ అంతా ముష్కల్ సేస్తానీ. హుకుం దేదేవ్.

షరీ—(ప్రవేశించి యుదకము పాత్రతో నిచ్చును.)

మోఅ—బద్మాష్! మంచినీళ్లు కైకులాయా రే! (పాత్రను పారవైచి) జావ్! అమారా దారూ—మాలుంహై—దారూ—పారాలియావ్.

షరీ—బహుత్ అచ్ఛాహై సర్కార్! (నిష్క్రమించును.)

మీర్—సర్కార్! సర్కార్! దారూమానండి పాదుషా హిన్నాయి అంటే మీకీ సాలా సిచ్ఛహైతాది మీకీపోషక్ గాఉన్న మాకీబీ సిచ్ఛహైతాది మానుఅండీ సర్కార్!

షరీ—(ప్రవేశించి) సర్కార్! సర్కార్! దారూకాబుడ్డీ సబ్ ఖాళీ హోగియా హౌక్కీబీ లేదు.

మోఅ—హౌక్కీబీలేదు? అల్లా! క్యాకరుం? దారూనై తో బుద్ధీ తక రార్ హైతాదీ క్యాకరుం? క్యాకరుం? (కొంచెమాగి) రే! షరీక్! దారూపోతేపోనీ, బాలామణ్కీ తీస్కురా.

షరీ—బాలామణీ క్యాహైసర్కార్?

మోఅ—మాలుంనై రే జంగ్లీ! బాలామణీఅంటే మైప్యారీ భోగంవాడ్.

షరీ—భోగంఅమ్మా! మాలుంహైసర్కార్! (నిష్క్రమించును.)

మీర్—సర్కార్! సర్కార్! మంచిహినోక్డీ. హులుకా దారూ ప్యారీ, ఏకీన్ షైతాన్కా మీకీ సాలా హులవాటుచేసి, రాజెం మీాద కుషాల్ లేకుండాఅయింది. హినోక్డీ.

షరీ—(ప్రవేశించి) సర్కార్! సర్కార్! బాలామణీఅమ్మకీ యిస్తానన్నడబ్బు మీారు హియ్యలేదంట. గుడారంయిడిసి రాతిర్ ఉదేగిరికే దౌడ్ తీసిందీ.

మోల—దౌడ్? మైప్యారీ—బాలామణీ—దౌడ్‌గియా? అల్లా దారూలేక బాలామణీ లేక మాకీ హేంసెయ్యాలా? మీార్ జుమ్లా! తుంబద్మాష్‌హై. నాదారూ హంతా దాసియేసి, నాప్యారీకి ఫరార్ సేయించి మాకీ హేడ్పిస్తావ్ తోస్తుంది.

మీర్—నైనై సర్కార్! మీాకీ లచ్చల్ సలాంజేసి సెప్తాక హల్లాపని నాకీసేస్తే హల్లాతోడు.

మోల—మాకీబుద్దిహంతా గడ్‌బిడ్‌సే గందరగోళంహైతాదీ. రే! బాలామణీషైతాన్! హెంతామోషం సేశావ్! చార్‌దిన్మె నాల్గులచ్చల్ రుపియానమ్లీాయేసి దర్బార్కాయిడిసి దౌడ్‌తీశావ్ అల్లా క్యాకరూం?

(రామసింగు ప్రవేశించును.)

రామ—యువరాజా! అభినందనములు.

మోల—రాంసింగ్ అభినందన్ గిభినందన్ మైకు మాలుం నైహై. నాకీబుద్దిహిప్డు హేమి తోస్తాయ్‌లేదూ (అని పిచ్చివానివలె తిరుగుచుండును.)

మీర్—(తనలో) హీ రాంసింగ్ దుష్మన్‌వాలాహున్నాడ్ షివాజీకీ హీండ్కి తోడానేస్తంసే కమామిష్‌సేస్తార్‌అని నాకీకొంచెం షమాచార్ హైంది.

రామ—(తనలో) నాపన్నుగడల కనుకూలమైనస్థితియందే యీ యువరాజున్నట్లు తోఁచెడిని. సారాయము నిశ్శేషమగుటయు బాలామణి పారిపోవుటయు వీరికిపుడు మిగుల చిత్తభ్రాంతిని గలిగించి యుండనోపు. అదియుగాక ధనాగారమునం దొక్క రూప్యమైనను లేదని విన్నాను. రెండులక్షలరూప్యములను నిరువురు తురుష్క భోగ కాంతలనుమాత్రమేగాక, రెండుపెట్టెలతో కొన్ని సారాయిబుడ్లను గూడ శ్రీశివాజీ పంపియున్నాఁడు. ఈ పరికరములతో వీనిని వశ మొనర్చుకొని, వీనికి రాజకీయవ్యాపారశక్తి లేకుండఁ జేయదగిన సమయ మిదేయని తోఁచుచున్నది. (ప్రకాశముగా) యువరాజా! రాజభక్తులము, విఖ్యాతదండనాథులము, మీదుమిక్కిలి మీకు ప్రాణస్నేహితులము మేమిందఱమిచ్చటనుండ, తమకెట్టిలోపము సంభ వించె? తామిట్లు మనోవ్యథనొందుటేల? మీవ్యథనుచూచి నిజముగా నాకు దుఃఖము పొంగి పొఱలి వచ్చుచున్నదికదా.

మీర్—(తనలో) ఏక్యాహై? హిండ్కిసూస్తే మీఠామీఠా మాటల్ బాత్ సేస్తాయ్. దుష్మన్ హైక్యావ్? హైక్యావ్?

మోల—రామసింగ్! హేంసెప్పఁ బాయీ! నాదారూ హంతాఖాలిహోగియా. నాప్యారీ బాలామన్కి దౌడ్‌గియా. నా ఖజానామే పైసాహంతా ఫరార్ హువా.

రామ—ఆహాహా! యువరాజా! మీయీకష్టము లన్నిటిని గట్టెక్కింప వలెనని సంకల్పించి కాబోలు, దైవమీయుత్తరమును శివాజిచే మీకు వ్రాయించినాఁడు చూచుకొనుఁడు. (ఉత్తరము నిచ్చును.)

మీర్—క్యా? పివాజీబద్మాష్ హుత్తరాల్ రాసిందీసర్కార్! హుత్తరం పింపిహెయ్యండీ. జరూర్సే పింపిహెయ్యండీ. హాడ్కి మోసం—

రామ—ఓయీ! సహసేనానాయకా! శ్రీయువరాజునకు సేవకుఁడ వను సంగతిని మఱచుచున్నట్టున్నావే. కానివో నాయనకు హితబోధనము నొనర్చుటకేల సాహసించియుందువు?

మీర్—అల్లా! నీకీదుష్మన్ నిష్చయంగా హులంతావ్.

రామ—తుచ్ఛా! మితిమీరిన ప్రసంగమునకు సాహసించిన యెడల నాలుక వేయిచీలికలుగా గోయుదును. జాగ్రత్తగా—(కత్తి దూయుచున్నాఁడు.)

మీర్—(కత్తిదూసి) క్యారే! బద్మాష్! నేనేది హంతా ద్రోగం. సెప్పేదిహంతా నేస్తం. అవ్ ర్! ఆవ్! నీకీ ముక్కల్ సేస్తాన్.

మోఅ—(అడ్డుపడి) హాం! హాం! ఘుస్తాహై కసూర్ మన్కండీ సాబ్ లోక్! రాంసింగ్! ఈబాత్ సమస్తానైహై నీకీ సదువ్రా (ఉత్తరమందించును.)

రామ—చిత్తము. (చదువును)

"రాజగడము"

శైశాఖశుద్ధనవమి.

శ్రీశ్రీ యువరాజ శ్రీసుల్తాన్ మోఅజీము గారి దివ్యసముఖమునకు. మొగల్ శ్రేయోభిలాషి యగు శివాజీ వ్రాయించు విశేషములు—

ఓ యువరాజా!

నీతండ్రియగు నౌరంగజేబుచేఁ బ్రేరితుఁడవై నాతో యుద్ధము సేయఁ బ్రయత్నించుచుంటివని వినియున్నాను. అట్టియుద్ధ మనవసర మని తెలియపఱచుటకు ఈకమ్మ వ్రాయించుచున్నాను. ఏమన, నాకు మీరాజ్యముపై నాశలేదు. నాకున్న రాజ్యమేచాలును.

అదియుంగాక హిందూదేశమునే స్వదేశముగాం జేసికొనియున్న మీరు మాతోబాటు భారతమాతృ పుత్రులరై యున్నారు. అట్లగుట యేక దేశీయులమగు మనయందు బరస్పర కలహములు నింద్యములు. దేశా రిష్టకములు. మీతో—నందును ముఖ్యముగా నీతో స్నేహమొన ర్చుట నాకు మిగుల ప్రీతికరము. నాస్నేహబుద్ధికి బ్రమాణములుగా, నీయుత్తరముతో గొన్ని బహుమతులను పంపియున్నాను. స్వీకరించి నాతో యుద్ధముసేయు యత్నములుమాని స్నేహధర్మము నవలం భింతురుగాక యని మిగుల వేడుచున్నాను.

ఇట్లు,

"శివాజి"

యువరాజా! ఉత్తరమునందలి సంగతులివి. అతండు పంపిన బహుమతు లెవ్వియనగా రెండులక్షల రూప్యములు—జగన్మోహను లగు యిరువురు వెలయాండ్రు—మఱియు రెండుపెట్టెలకు సరిపడి యున్న సూరత్‌సారాయపుబుడ్లు. అవియన్నియు నల్లదే ఆగుడారము నందున్నవి. దేవరయాజ్ఞ.

మోల—మైఅల్లా! హెంతా బగుమానం శేశాడ్! రెండూ లక్షల్ రుపియా, దో భోగంవాలా, సూరత్ కా సారా! హారే వహ్వ రాంసింగ్! శివాజీ బహుత్ అచ్చా ఆద్మీహై.

మీర్—సర్కార్! మీకీహోఖ్యామర్సీ మాతల్ సేస్తున్నార్ శివాజీకా బహుత్ బద్మాష్ హై. పాదుషాకాహుకుం జారీచేసిరి. హాడ్కీపట్టి బంద్‌సేస్తేనేగాని ఢిల్లీకారాజ్జెంహంతా కొల్లాగొట్టి మస్కీ హందర్కీ మింగియేస్తార్. ఎనచ్ హై. సర్కార్! రాంసింగ్ శివాజీ కల్సీ మీకీ మోసంచేస్తార్ నిష్చయం. పాదుషాకా నౌకర్మే మాకీ గడ్డంనెర్సింది. తలనెర్సింది. నలబై సమ్మచ్చరాల్ పాదుషాహన్నంతిని హున్నామ్. ద్రోగంసెయ్యటాన్కి దిల్ గా బ్రాహైతాది—

మోాల—ఖుష్రహు! రాంసింగ్! తుంబీఅచ్ఛా ఆద్మీ హై. షివాజీకి మాకీ నేస్తంబాగా కల్పవాలా. రే షరీక్! జాకర్ శివాజీ పంపిన సూరత్ సారా దోబుడ్డి లేఆవ్.

షరీ—బహుత్ అచ్ఛాహై సర్కార్! (నిష్క్రమించును.)

మోాల—రాంసింగ్! మీాకీ సాలాంసలాం. మాకీ సాలామేలు హైంది. హిక హెల్లండి. మీార్ జుమ్లా! తుంభి జావో.

మీార్—సర్కార్! మాకీమాాట హినోకండి. షివాజీతో లడాయికావాలుకుం జారీసెయ్యండి. మొగల్ పాదుషా షర్మానిల్పండీ.

మోాల—ఖుష్రహూ! మైఫిర్ బోల్తాహుం. జావో. జరూ ర్సేజావో. నీకీబాత్ తర్వాత హాలోషన్ సేస్తాం.

రామ—(తనలో) ఆరెండులక్షలరూప్యములు వ్యయపడునంతకు నా సారాయము ముగింపుజెందువఱకు, నా యిరువుర వెలయాంద్ర యందలి మోహ ముడుగువఱకు—నసగా కనీసమొకనెలదినముల వఱకు—వీడునున ప్రపంచములోనివాఁడుగా నుండబోఁడు. ఈలోపున శ్రీశివాజీ సింహగడమునేకాదు మొగలుల యధీనమందున్న దక్షిణ రాజ్యమునంతయుఁగూడ సాధింపగలఁడు. ఇంతకన్న నేమికావలయును? ధన్యోఽస్మి (ప్రకాశముగా) యుజరాజా! నా కిక సెలవు.

మోాల—అచ్ఛాహై రామ్సింగ్!

(రామసింహుఁడు నిష్క్రమించును.)

మోాల—మీార్ జుమ్లా! తీస్రోదఫా మైబోల్తాహుం జావో.

మీార్—(తనలో) అల్లా! హేంసెయ్యాలా! యువరాజ్కీ కిాడ్సిపెట్టాస్కీ నాకీ బుద్ధిరాదు. హిక్డా గుడారంసాటునదాగి సుాస్తాన్. దారుతాగి పడిపోతాడ్ తోస్తుంది. (నిష్క్రమించును.)

మోాల—క్యారేషరీక్! ధేరీకై కూసేస్తావ్! జల్దీఆవ్రేబద్మాష్

షరీ—ఆతాహుం—ఆతాహుం—సర్కార్ ! (అనుచు బుడ్లతో ప్రవేశము.)

మోల—(త్రాగి) వారేవా ! సూరత్కాసారాఅంటే ఆం గ్రిజ్కాసారాకావాలా. హెంతఅదృష్టం. రే షరీక్ ! జల్దీసేజాకర్ ఆబోగంవాడ్ దోనోకి అది లావో.

షరీ—బహుత్ అచ్ఛాహై, సర్కార్ ! (నిష్క్రమించును.)

మోల—ఖజానా ఖాలీఅయిందీఅంటే రెండులక్షల్ ఆగియా దాగూలేదుఅంటే అంగ్రీజ్ కాసారా రెండు పెట్టెల్ ఆగియా. బాలా నుస్కీ ఫరార్ అయిందీఅంటే హూక్కి రెండు భోగంవాడ్ ఆదియా. పేడాపట్టే మాకీ బెల్లంహైతాదికావాలా ! (మరల ద్రావి) ఈదారుకా మజా సాలాహుంది తోస్తాయ్. హుష్టే తలాగిర్తావె. హోయి ! హోయి ! ఉస్తరఫ్ సె దోప్యారీ—రంగేలీ ఆతాహై. హోయి ! హోయి ! (36) (మరల త్రాగును)

(దిల్ ఖుష్, హుషారీ, షరీకు ప్రవేశము.)

షరీ—సర్కార్ ! భోగంహుంమ్మల్ హిదేవచ్చినార్. (తనలో) హీల్కిసూస్తే నాకీరక్తంహుంతా జల్ జల్ హుడ్తాది షహబాష్ ! హెంతఅందంరా !

మోల—రే షరీక్ ! హిళ్కి సూసి ; గుడ్లూ మిటకరించి గుటకల్ మింగుతున్నావ్రే, బద్మాష్ ? జావ్ ! (అని తన్నబోవ)

షరీ—(పారిపోవును.)

దిల్—హుషా—మహారాజా ! నమస్కారములు.

మోల—అచ్ఛాహై. ప్యారీ ! మీకీనాం క్యాహై ?

దిల్—నాపేరు దిల్‌కుష్.

హు—నాపేరు హుషారీ.

మోఅ—దిల్‌కుష్! తోడా హమృతంతాగి దిల్ కుష్‌కరో, ఆవో హుషారీ! తోడాపానీ బోజన్ సేస్తే, ప్రయాణ్ కా ఆయాసం హంతా పోతాదీ. ఆవో.

దిల్—మహారాజా! త్రాగుడు మాకలవాటు లేదుసుమండీ.

మోఅ—అచ్ఛా హుషారీ! మోహినీ! మీకీదోబీ గానా బజాయించి నాచ్‌కరో.

దిల్— } చిత్తం. (నృత్యమొనర్చుచు పాడుచుందురు.)
హు— }

మోఅ—షహబాష్ షహబాస్! (రెండవబుడ్డినికూడ పూర్తిజేసి తూలుచుగూరుచుండి) అల్లా! అంగ్రీజ్‌కాసారా బహుత్ అచ్ఛాహై తలాఅంతా గిర్తాహై. దిల్‌కుస్! నీకీ జగన్మోహినీహై. నీక్ నాకీజోడూ. వారేవా! బహుత్ మజాహై హాయి! హాయి! (అనుచు మత్తుచే పడిపోవును.)

(పురుషవేషధారిణియైన రోషనార పార్శ్వయవనికకు బ్రక్కగా ప్రవేశము.)

రోష—ఆహా! స్వామిభక్తిపరాయణుఁడగు మీర్ జుమ్లా ఈ శిబిరద్వారమునకుఁజెంత నాకు దటస్థుడై—నేను రోషనారనని చెప్పిన తోడనే యిచటివృత్తాంతములను సర్వము నా కెఱింగించెను. అతనితో నిపుడాలోచించిన పన్నుగడ నొక ననుసరించి మోఅజీను రామసింహులను శృంఖలాబద్ధులనుగాజేసి, సేనానాయకత్వమును నేనే వహించి శివాజీతో యుద్ధమొనర్చి నా ద్వేషానలమును శమింపజేసికొందును గాక! (అని రంగములోనికి బ్రవేశించి యాశ్చర్యస్తబ్ధయగును.)

దిల్—
హు—
} (నృత్యమునాపి తెల్లబోయిచూచెదరు.)

రోష—ఔరౌరా! ఈ రాజశిబిరమేమి? ఈ భోగపు తొత్తులేమి? ఈ నృత్యములేమి? ఈబుడ్లేమి ఈ యువరాజు మైమఱచియుండుటేమి? అహా! హిందూదేశము నేకచ్ఛత్రముగా బరిపాలించుచున్న యౌరంగజేబు నంతటివాని జ్యేష్ఠపుత్రునికా—ఢిల్లీసింహాసనార్హునికా—యిట్టిదశ? ఓ తొత్తులారా! ఆ గర్వాంధుఁడు—యారాక్షసప్రాయుఁడు—ద్రోహి—ఆ కొండయెలుక—శివాజీ—యాతఁడు పనుపగా వచ్చినవారేనా మీరు! నిజముచెప్పుడు. లేకున్న మీడొక్కలు సించి డోళ్లుకట్టించెదను.

దిల్, హు—(గడగడవణకుచు) చిత్తము. చిత్తము.

రోష—ఓ తొత్తులారా! మీ రహస్యముల నన్నిటిని నే నెఱుంగుదును. మోఅజీమును మీకౌఁగిళులయందు నిమరఫుచ్చి, తన్మూలమున నాతనికి రాజకీయవ్యవహారాసక్తి లేకుండజేయుటకై వచ్చియున్నారు. కానిండు. మీకుదగిన శాస్తిజేసెదను మీర్ జుమ్లా!

(ముఫ్వురభటులతో మీల్ జుమ్లా ప్రవేశము.)

రోష—మీర్ జుమ్లా! నీభటుల సహాయముతో నీయిరువురు తొత్తులను దీసికొనిపోయి నీశిబిరమునబెట్టి తాళమువేసి రమ్ము.

మీర్—బహుత్ అచ్ఛాహై. అవ్ బే పిఁజారీలోక్! (భోగకాంతలతో భటులును మీర్ జుమ్లాయును నిష్క్రమింతురు.)

రోష—(మోఅజీమును బరిశీలించి) బాత్తిగా మైమఱచినట్లున్నాఁడు. వీనికి స్మృతి పూర్తిగా రాకమునుపే నేను ప్రాయింపఁబోవు ఫర్మానాపై వీనిసంతకమును జేయింపవలయు.

(మీర్ జుమ్లా ప్రవేశము.)

రోష—మీర్ జుమ్లా !

మీర్—హుకుం దేదేవ్ అమ్మా !

రోష—అమ్మా ! అనుకీతినినన్ను సంబోధించినయెడల పరులు విన్నచో మన పన్నుగడలన్నియు భంగము నొందును. కావున నిఁక మీఁద నన్ను వీరసింహనామమున సంబోధించుము.

మీర్—బహుత్ అచ్ఛాహై. యీార్సింగ్ మహారాజ్ ! హుకుం దేదేవ్ జీ !

రోష—సరే, ఆమేజాపైనున్న కలమును, కాగితమును తీసికొని నేను చెప్పబోవునట్లొక ఫర్మానాను వ్రాయుము.

మీర్—బహుత్ అచ్ఛాహై మహారాజ్ ! హిందూస్థాట్ గియా. చెప్పండి మైతాయ్యార్ హువా.

రోష—తేదీని స్థలమును వ్రాయుము.

మీర్—జరూర్సే రాస్తాఁ మహారాజ్ ! (వ్రాసి) ఆపైన బోలండీ సర్కార్.

రోష—(నెమ్మదిగా) నా కొలువునందున్న సర్వసైన్యములకును సైన్యాధిపతులకును, ఔరంగజేబు పాదుషాకు ప్రథమపుత్రుఁడను దక్కన్ రాజ్యములకు ప్రతినిధినగు—నేను—సుల్తాన్ మోఅజీము అను పేరు గలవాఁడను, నేఁడు యీఫర్మానామూలమున నేమని యాజ్ఞాపించుచున్నాననగా !— నాదేహమునందు ప్రాణాపాయకరమగు కొండొకరుగ్మత ప్రవేశించియుండుటచే యుద్ధమును స్వయముగా నడిపించుటకు వలనుపడక నాకు బదులు నాస్థానమున వీరసింహుఁడను పేరుగల యీరాజపుత్రుని నియమించి, యీతనికి నాకుగల సర్వాధి

కారముల నిచ్చి, శివాజీమీఁదికి నేఁడే దండెత్తిపోవు నట్లేర్పాటు జేసియున్నాను. కావున మీరెల్లరు వీని యాజ్ఞలను నా యాజ్ఞలుగా శిరసావహింతురుగాక !

మీార్—సిత్తం. తర్వాతబోలండి మహారాజ్ !

రోష—తరువాత నేమియులేదు. మత్తు పూర్తిగా విడిపోవక మునుపే మోఅజీముచే దానిపై మెల్లగా సంతకము జేయింపుము-- అదే కదలుచున్నట్లున్నాఁడు.

మీార్—బహుత్ అచ్ఛాహై మహారాజ్ ! (మోఅజీముని సమీపించి) సర్కార్ ; సర్కార్ ; ఉటోజీ ; హిడ్డాసంతక్ సెయ్యండీ.

మోఅ—(కనులు తెరువకయే) క్యాబే ; దిల్‌కుష్ ; ఆవో ; ఆవో హాక్కే ముద్దూ దేదేవో. తోడా దారూబీ లియావ్.

మీార్—సఁయ్యా ; ముద్దూహిస్తాన్ దారూబీతెస్తాన్. హిడ్డా సంతక్ సెయ్యండీ.

రోష—సంతక మేలయని యడుగునేని, సంతకములేనిదే శిబిర రక్షకుఁడు దారూ తేనియ్యఁడని చెప్పుము.

మీార్—సర్కార్ ! నై నై—సఁయ్యా; సఁయ్యా; సంతక్ కరోజీ.

మోఅ—సంతక్ కైకూబే ప్యారీ ?

మీార్—సంతక్ నైతో, సారావాలా దారూ హిస్తాయ్ లేదూ. హిడ్డా సెయ్యండీ.

మోఅ—అచ్ఛా ప్యారీ ! మాకీ సెయ్యి హిచ్చివేస్తామ్. సంతక్ సేయించుకో.

మీార్—(చేయిబట్టి సంతకముజేయించి) అచ్ఛా ! సఁయ్యా ; అబిదారూలేతా. అబ్ సోజావ్.

రోష — సరే ఫర్మానా ఇటుదెమ్ము. ఓరీ ! యెవఁడురాలక్కడ ?

(భటుఁడు ప్రవేశము.)

రోష — నీవు వెంటనే పోయి, రామసింహ సేనానాయకుని గలసికొని యతిరహస్యమగు నొక రాజకీయ కార్యమును గూర్చి ప్రసంగించుటకై తనను మోలజీము సర్కారు సత్వరము రావేషు చున్నాడని తెలిపి తీసికొనిరమ్ము.

(భటుఁడు నిష్క్రమణము.)

రోష — మీర్ జుమ్లా ! రామసింహుఁ డిచటికిఁక వచ్చు చున్నాఁడుకదా ! రాజదర్శనార్థియై వచ్చుచుండుటచే నిరాయుధుఁడై కదా యాతఁడు వచ్చును ? కావున నీవేమి చేయవలెననగా, నీ త్రాగు బోఁతును ముందుగా మోసికొనిపోయి, యాయిరువురు తొత్తులున్న గుడారమునందే బంధించి, ముప్పదుగురు భటులను శిబిరముచుట్టును రక్షకులుగా నియోగింపవలయు. అనంతరము ఖడ్గధారులును, క్రూరులును నగు నలుగురు మహమ్మదీయ భటులను వెంటనిడుకొని నీవీ శిబిరద్వారమునకు జాటున నక్కి-యుండవలయు. ఆరామసింహ రాజద్రోహితో బ్రసంగించుచు నేను ప్రసంగసందర్భమున "శివాజీకిజై" యని ఎప్పు డెలుంగెత్తి యఱచుదునో, యపుడు సమయముగా నెఱింగి మీరు వెలికివచ్చి, యొక్కమ్మడి వానిమీదఁబడి పట్టి బంధించి కారాగారమున కీడ్చుకొనిపోవలయు. గ్రహించితివా.

మీర్ — హా ! సబ్. మాకీ హర్ధంహాయిందీ — మహరాజ్.

రోష — సరే. ఈ కులభ్రష్టుని యిఁకనీడ్చుకొనిపొమ్ము.

(మీర్ జుమ్లా మోలజీమును మోసికొనిపోవును.)

రోష — మంచిది. అల్లదే రామసింహుఁడు కాఁబోలు వచ్చు చున్నట్లున్నాఁడు. నాటకమిఁక నాఁడవలయు.

రామ—(ప్రవేశించి) ఓయీ ! రాజపుత్రా ! నీవెవఁడవో నాకు దెలియదు. శ్రీసుల్తాన్ మోఅజీము నన్ను పిలువబంపెను. ఆతఁడెచ్చట నున్నాఁడో చెప్పఁగలవా ?

రోష—రామసింహ మహాశయా ! మిమ్ము పిలువబంపినది మోఅజీముకాదు. నేను.

రామ—ఆ ! ఏమి ! నీవా !

రోష—ఔను. నేను శ్రీశివాజీ పనుపున వచ్చిన దేశభక్తుఁడను. ఆతని యాజ్ఞానుసారము మహాసాహసమున నీరాజ శిబిరమున జొచ్చి నాబాహుబలముచే మోఅజీముని బంధీకృతునొనర్చి, ధనబలముచే మహమ్మదీయ సైనికులనెల్లర మనపక్షమునకు ద్రిప్పి రక్తపాత రాహిత్యమైన మహావిజయమును శ్రీశివాజీప్రభువునకు సమకూర్చి యున్నాను.

రామ—ఆహా ! యెంత యద్భుతము !

రోష—ఆర్యా, నేటికి మూఁడవదినమున శ్రీశివాజీ రాజగడమునందు గొప్పదర్బారు చేయబోవుచున్నాఁడు. ఆనాటికి మిమ్మచటికి దీసుకొనిరావలయునదిగా నాకాజ్ఞ నిచ్చియున్నాఁడు. కావున తామికనా వెంట రాఁదగునని ప్రార్థించుచున్నాఁడను.

రామ—మునుమ్మాటికి వచ్చెదను.

రోష—మహాసంతోషము. సంతోషము. జయ్ శ్రీశివాజీకి జయ్ ! (వెనుకనుండి మీర్ జుమ్లా ప్రభృతులువచ్చి రామసింహుని మీఁద బడెదరు.)

రామ—(విస్మయ స్తబ్ధుఁడయ్యు వెంటనే ధృతధైర్యుండై) ఏమీ యీమోసము ? ఓరీ ! పయోముఖవిషకుంభమా ! ఘోర విద్రోహి

(అనుచు మీర్ జుమ్లా చేతనున్న కరవాలమును చివాలున లాగికొని) ఓరీ ! తుచ్ఛులారా ! ఇఁక జూడుఁడు ? (అని కత్తి త్రిప్పును)

రోష.—మీర్ జుమ్లా ! భటులారా ! ఆ తుచ్ఛుని విడువకుడు! నఱకుఁడు ! తఱుగుఁడు ! ఇంతలో నేను మఱికొందఱ సైనికులను దీసుకొని వచ్చెదను. (నిష్క్రమించును.)

రామ.—(తనలో) ఇఁక నిచట జాగుచేసినచో నపాయకర మగునని తోఁచుచున్నది. ఈనలువుర దుష్టులను మట్టుబెట్టి నేను పలాయన మొనర్చెదగాక.

మీర్.—క్యారే ! హుస్సేన్ ! సిద్దీ ! జలాల్ ! హుషార్ కరో ! హిండ్కి హజామత్ సెయ్యండి.

రామ.—(అందఱను గాయపఱచి) జయ్ ! శివాజీమహారాజ్‌కీ జయ్ ! హర్ ! హర్ మహదేవ్ ! (అని నిష్క్రమించును.)

రోష.—(ప్రవేశించి) మీర్ జుమ్లా! ఏఁడీ! రామసింహుఁడేఁడీ?

మీర్.—(అలసటతో) మహారాజ్ ! మహారాజ్ ! మాకీసబ్ ఏక్‌దం మారి హిండ్కి దవుడ్‌గియా !

రోష.—పారిపోయెనా ! ఛీ ! ఛీ ! (ఆలోచించి) సరే ? ఈ విఘ్నమునకు వెఱువఁబనిలేదు. కాని మీర్ జుమ్లా ! శ్రద్ధతో వినుము. ఒక్కనిముషమైన జాగుసేయక మన సైన్యముల సర్వము నాయత్త మొనర్చుకొని నేటి సాయంతనమే సింహగడమునకు బయనము కావలయు. ఇదినాయాజ్ఞ. రామసింహుని బట్టుకొను విషయమై తరువాత నాలోచించెదగాక పొమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)

(యవనిక జారును.)



# పంచమాంకము.

రాజగడము—శివాజీ దర్బారు.

(శివాజీ, మోరోపంతు, త్ర్యంబకరావు, నేతాజీ, గంగాధరుఁడు, దండనాథులు, సభికులు ప్రవేశము.)

శివా—అష్టప్రధానులారా! దండనాథులారా! సభికులారా! సింహగడమును సాధించుటకై నావలన నియుక్తుఁడై పోయియుండిన మనవీరాగ్రేసరుఁడు—మహాయోధ—తానాజీ మాలసురే—అనన్య సామాన్యములగు తన శౌర్యపరాక్రమముల నెప్పటివలె ప్రదర్శించి, యీ యుదయముననే యీదుర్గమును సాధించెనన్న శుభవార్త నాకిం తకుమునుపే తెలియవచ్చెను.

అందరు—జయ్! మహారాష్ట్రకీ జయ్!

శివా—మన యీ పవిత్ర మాతృభూమికి రాజధానియగు నీరాజగడమున కేకమీఁద మహమ్మదీయుల ముట్టడివలన భయముండ బోదు.

త్ర్యంబ—ఇంతకును దేవా! కీడెంచి మేలు నెంచవలయునని కదా పెద్దలు చెప్పుదురు. కావున మనము యుద్ధసన్నాహముల సత్వర మొనర్చుకొనుటయే మేలని నాయభిప్రాయము.

నేతా—దేవా! త్ర్యంబకరావుజీ వచించినట్లు యుద్ధప్రయత్న ములు మనకిపు డవశ్యకర్తవ్యములని నాకుగూడ దోఁచుచున్నది.

గంగా—సింహగడము పడినసంగతి నెఱిగి మోఅజీము కోప క్రోధఘూర్ణితుఁడై సైన్యములతో మనమీఁది కిపుడు వచ్చినచో

మిగుల నపాయము వాటిల్లును. యుద్ధమునకు సిద్ధముగానున్న భటులు మనయొద్ద నిపుడు నాల్గువేలకన్న నెక్కుడుమంది లేరు. దేవా! త్వర పడకున్నచో మనకు మిగుల ముప్పువాటిల్లును

మోరో—కాని ప్రధానులారా! ఒక విశేషముగలదు. మోఅజీముకొలువునందున్న రామసింహుఁడను రాజపుత్ర సేనానాయకుని మూలమున మనమా మోఅజీముని వశమొనర్చుకొనియున్నాము. ఆకారణమున నాయువరాజు మనపై నింతలో దాడివెడలివచ్చుట యసంభవము.

("హా! విఘ్నము! విఘ్నము! మోసము! మోసము!" అనుచు రామసింహుఁడు ప్రవేశము.)

అందరు—(విస్మయము నొందెదరు.)

శివా—రామసింహమహాశయా! ఈ తొట్రుపాటేమి? ఈ వైఖరియేమి? ఈ—

రామ—దేవా! విఘ్నము! విఘ్నము! మోసము! మోసము!

మోరో—ఎట్టివిఘ్నము? ఏమిమోసము?

రామ— నే నెన్నఁడు నంతకుబూర్వము కనిగాని వినిగాని యుండ లేదు—ఒకయువకుఁడు—వీరసింహనామకుఁడట—మోఅజీముని కారాగృహబద్ధునిగా నొనర్చి—నన్నుగూడ నొనర్చుటకు సిద్ధపడి—సర్వసైన్యములకును ముఖ్యనాయకత్వమును—వహించి, యతివేగమున యుద్ధమునకు వచ్చుచున్నాఁడు. రేపుసాయం సమయమునకు సింహగడమున బ్రవేశింపగలఁడు.

మోరో—హా!

శివా—సచివా! అధైర్యమువలన ఫలములేదు. రామసింహమహాశయా! శత్రుసేనల పరిమితి మీకు విశదమా?

రాము—ఇరువదివేల కాల్బలము, ఎనిమిదివేలగుఱ్ఱపుదళము, నలువది యేనుఁగులు, ఇరువదిరెండు ఫిరంగులు.

అందరు—ఘోరము ! ఘోరము !

శివా—ఆహా ! శాత్రవు లింతత్వరలో నిట్టిబలముతో దాడి వెడల గలుగుదురని కలనైన దలంచి యుండలేదుగదా !

రాము—(27) దేవా ! ఆనాఁడు నేను మీకు జేసియున్న వాగ్దానమును నెరవేర్చుకొనజాలనందులకు మిగుల విచారము నొందు చున్నాను. అయినను మఱొక్కసహాయ్యము నావలన మీకు గలుగఁ గలదు. అదెట్టిదన, నాకు ప్రాణస్నేహితుఁడును—నావలెనే దేశ సేవకుఁడును నగుజయసింహుఁడను మొఘల్ సేనానాయకునిక్రింద నొమ్మిదివేల రాజపుత్రసైన్యముగలదు. ఆతనిని ప్రోత్సాహపఱచి, యాసైన్యమును మొఘల్సైన్యమునుండి విడదీసి మీపక్షమునకుఁ ద్రిప్పెదను.

మోరో—మహాభాగ్యము !

శివా—ఆర్యా ! అనుపమానమగు మీసహాయ్యబుద్ధికి నేను మిగులకృతజ్ఞుఁడను. అయినను సభ్యులారా ! తానొకటి తలంచిన దైవమొండు తలంచుచుండును. ఉన్నవియున్నట్లు ప్రస్తుతస్థితిగతుల నిపు డాలోచింతము. మనయొద్ద నాల్గువేలభటులుమాత్రమే కలరు. అంతకు పదిరెట్లు శత్రువులయొద్ద నున్నారు. కావున వారితో బహి రంగముగా రణమొనర్చుట ప్రస్తుతమున మనకు గడుంగడు నకా ర్యము మనకిఁక నొక్కటే మార్గముకలదు. నేతాజీ దండనాయకా !

నేతా—మహాప్రసాదము. దేవా !

శివా—నూర్వురు మావళేభటుల వెంటనిడుకొని సత్వరము పోయి సింహగడమునందున్న మన తానాజీకి మొగలులరాక నెఱింగించి

నాపలుకులుగా నిట్లువచింపుడు.

గీ. అన్నమదిలేక ద్రావ నీరైనలేక
యెన్నికష్టములైన రానిమ్ము ; కాని
మేనిలో ప్రాణవాయువు మెలఁగుదాఁక
సింహగడమును పగఱకు జిక్కనీకు.

నేతా—మహాప్రసాదము. నా కిక సెలవా !

శివా—మంచిది.

నేతా—(నిష్క్రమించును.)

శివా—సభ్యులారా ! మనయొద్ద నిపుడున్న భటులలో రెండు వేలమందిని యీ రాజగడరక్షణార్థమై యీ గంగాధర దండనాథుని నాయకత్వమునకు విడిచి, తక్కటి రెండువేలతో నే నీరాత్రియే పూనానగరమునకుఁబోయి వలయుసైన్యముల సేకరించి, తగినసమయము నరసి, మొగలుల నెదుర్కొందును. అంతవఱకు మీరెల్లరు నీ రాజగడమును నప్రమత్తులరై రక్షించుచుందురుగాక !

రామ—దేవా ! జయసింహుని గలసికొని మాట్లాడుటకై నేను పోవలయు ననుమతి దయచేయుఁడు.

శివా—సంతోషపూర్వకముగా నిచ్చుచున్నాను.

రామ—(నిష్క్రమించును.)

శివా—సభ్యులారా ! ఒక్కనిమేషమునైన మనమిక దుర్వ్యయము చేయరాదు. ఈసభ యీనాటి కిఁక ముగియుఁగాక !

అందరు—(28) శివాజీ మహారాజ్ కీజయ్ !

(తెరజారును.)



# షష్ఠమాంకము.

ప్రథమరంగము—సింహగడప్రాంతము—యుద్ధభూమి.



(జయసింహుఁడు—విక్రమసింహుఁడు ప్రవేశము.)

విక్ర—జయసింహా! నిన్నటికన్న నేటియుద్ధము ఘోరతరముగా నున్నదేమి?

జయ—ఏలయనఁగా, ఈ నడుమ నాల్గుదినములనుండియు శివాజీ పూనా ప్రాంతముల సంచరించి బహుళసంఖ్యాకములగు సైన్యముల సమకూర్చుకొని నిన్నసాయంతనమే యీప్రాంతములకువచ్చి మనతో నీనాఁడు యుద్ధమునకు డీకొనెను.

విక్ర—అట్లయిన మనకీ సింహగడము లభించుట యిఁక దుస్తరమగునాయేమి?

జయ—ఏమో—జయాపజయంబులు దైవాధీనములుకదా. కాని సహసేనాధిపతీ! అల్లదె యాదిక్కు చూడుము.

మ. స్ఫురదుగ్రానలగోళసంఘములతో బూంకారశబ్దాళితో
గురుభీకారములై శతఘ్నులవె దిక్కుల్ బ్రద్దలౌనట్టు లే
కరువున్ బట్టెడు, సుచ్ఛ్రియస్థితిని సంగ్రామంబు జేగెన్ భళీ!
యిరుకక్షుల్ వెనుదీయకున్నవి యత్కృష్టప్రతాపంబునన్.

విక్ర—సోదరా! ఈఘోరయుద్ధమును జూడగా,

సీ. తతశతఘ్నీముఖోద్గత ధూమజాలముల్
కాఱుమబ్బులరీతిఁ గ్రమ్ముకొనుట
పలుఫిరంగుల మహాధ్వాంకారములు భయం
కర మేఘగర్జలగతి నుఱుముట
ప్రేలుచో వెడలెడి జ్వాలికామాలికల్
మెఱపులరీతిని మెఱయుచుంట
భీభత్సకరములై నిప్పుగుండులు
గొప్పవర్షమువోలె గురియుచుంట

గీ. పాతభటనికాయముల దేహతతులనుండి
చిమ్ముకొనివచ్చు వేడిరక్తము కొండ
వాఁగులట్టుల రయమునఁ బాఱుచుంట
చిత్రవర్షర్తుదినమట్లు చెలఁగనేఁడు.

జయ—సోదరా! అల్లదే యావంకఁజూడుము.

ఉ. అల్లశతఘ్నులన్ వెడలి యావిరి మంచువిధాన రోదసిన్
మెల్లగఁ బ్రాకు నాపొగలు మేలిముసుంగులరీతి నుంటచే
నెల్లరలోన నే రరుల్లో? యెవ్వరు స్నేహితులో? యెఱుంగ లే
కల్లరిజేయసాగిరదె యందును నిందును సైనికావళుల్.

విక్ర—కాని జయసింహా! ఈదెసఁ జూడుము. అనచ్చు చున్నవాఁడెవఁడో యోగివలె నున్నాఁడే.

(యోగివేషధారియైన రామసింహుఁడు ప్రవేశము.)

జయ—అయ్యా! ఈయుద్ధభూమియందీరీతిఁ ద్రిమ్మరుచున్నారేమి?

రామ—మీకొఱకే. అందును ముఖ్యముగా నీకొఱకు.

జయ—నాకొఱకా! మీరెవరు?

రామ—నేను నీ ప్రాణస్నేహితుఁడను. మొన్న మొన్నటి వరకు సహసేనానాయకుఁడను, రామసింహుఁడను. (అనుచు కపట వేషమును దీసివేయును.)

జయ—(రామసింహుని హస్తమును బట్టుకొని) ఓయీ రామసింహా! మన ప్రాణస్నేహము నట్లుండనిమ్ము. రాజద్రోహము నెంచి మొగలుల గుట్టుమట్టులను శివాజీకిఁ దెలియఁజెప్పిన నిన్ను రాజసేవకుఁడనగు నే నిదే ప్రగ్రహనిగా—ఖైదీగా—బట్టుకొనుచున్నాను.

విక్ర—నాకును సమ్మతమే.

రామ—(నవ్వుచు) జయసింహా! పరిహాసమునకిది సమయము కాదు. దేశసేవ జేయవలెనను ఘనాభిలాష నీకుఁగలదని నాతో పలుసారు లదివరకు నుడివియుంటివి. నీయభిలాషను మనసారఁ దీర్చుకొనుట కిపుడు మహాసమయమొందు తటస్థించినది.

జయ—రామసింహనామధేయా! నాతో నీప్రసంగ మనవసరము. నేను నీతో నిపుడు జయసింహుఁడనుగా మాట్లాడుచుండుట లేదు. రాజసేవకుఁడనుగ—దండనాథునిగ—మాట్లాడు చున్నాను. గ్రహించుకొనుము. విక్రమసింహా! రమ్ము. వీనిని దీసుకొనిపోయి మనస్వామియగు వీరసింహున కప్పగింతము.

రామ—ఏమేమీ! జయసింహా! ఇవియన్నియు మనస్ఫూర్తిగా నాడుచున్న మాటలేనా!

జయ—ముమ్మాటికిని.

రామ—దైవసాక్షిగా!

జయ—దైవసాక్షిగా.

రామ—(చేయి విడిపించుకొని) ఓరీ! తుచ్ఛా! (అని కత్తి దూయును.)

జయ, విక్ర—(కత్తులు దూయుదురు.)

రామ—ఓరీ పారుబోతా! మహా దేశభక్తుఁడనుసుమీ యనుచు పలుమారులు నీవాడిన నీచప్రగల్భములను—నిజములని నమ్మి కడుంగడు మోసపోతినే కాని,

ఉ. మాఁడలు రెండునుంగ్లు ప్రతిమాసము వేతనమున్ గ్రహించి, పెన్ త్రాఁడులనంటివో బిరుద తండములన్ వహియించి సిగ్గుబో నాడి మొగల్ మహీపతికి నాత్మను తెక్కల నమ్ముకొన్న నీ వేఁడ? స్వదేశసేవ యదియేఁడ? యనామక బాలిశాధమా!

జయ—ఓరీ కుటిలాత్మా!

గీ. దొంగవై నాకు నేఁడిట దొఱకియుండి
దొరవిధంబున మాట్లాడదొడఁగినావు
కత్తి నీచేతనున్నట్టి గర్వమేమొ?
యొకటికిని రెండుకలవు సుమ్మో కుబుద్ధి.

విక్ర—ఔరౌరా! కులకళంకా! మాజయసింహుని దేశభక్తినిగూర్చి సారెసారెకు నెత్తిపొడుచుచున్నావు. దేశసేవయనగా నీవుచేసినయట్టి ఘోరరాజద్రోహమేయని యెంచుచున్నావు కాఁబోలు. తుచ్ఛా! ఇట్టిదుర్బుద్ధి నీకే పుట్టినదికాని—దేశభక్తిచేగానిమ్ము—దైవభక్తిచేగానిమ్ము—ఘనతమగు మరెట్టిభక్తిచే గానిమ్ము—సద్వంశసంజాతుఁడగు రాజపుత్త్రుఁడు తానుగొలుచుచున్న యజమానియెడ మాత్రము కలనైన ద్రోహముతలంపడు.

రామ—ఓమూర్ఖులారా! దేశాభిమానశూన్యులై, దాస్యవృత్తిని—యవమానకరశ్వవృత్తిని—మఱిగి మసలుచున్న మీయట్టి నీచులకిట్టి యపౌరుషేయప్రసంగముగాక మఱేమి చేతనగును? ఛీ!

మీతో ప్రసంగమొనర్చుట నాకుగూడ యవమానకరము. నాత్రోవ నే నిదే పోవుచున్నాను. అడ్డునిలుపకుఁడు. (పోఁబోవును.)

జయ, విక్ర—(అడ్డగింతురు.)

జయ—ఓరీ తులువా! పారిపోవఁజూచుచుంటివా!

గీ. పౌరుషంబునఁ దీండ్రించు బంటువేని
మమ్ము భజించి నీత్రోవఁబొమ్ము; లేక
పందవైయైన ఖడ్గంబు బాఱవైచి
రిమ్ము మాప్రభు సన్నిధానమ్మునకిఁక ?

విక్ర—అంతియకాదు.

గీ. చేసినట్టి ద్రోహమునకు సిగ్గుజెంది
ప్రభుపదంబుల కెరఁగి ప్రార్థనమొనర్చి
తప్పిదము నొప్పుకొనుటయే యొప్పునింక
కానిచో నీకు ఘోరదుర్గతి ఘటిల్లు.

రామ—ఓరీ ప్రేలఁబులారా! ద్రోహమా! క్షమించుటయా! మీప్రభువా!

ఉ. భారతమాతృగర్భమున పాయనిశత్రువులై జనించి, దే
శారులతోఁడగూడి భరతావనిపైఁబడి దోఁచుచున్న పెక్
చోరులుమీరు మీవలెనె చోరుఁడు మీయజమాని మిమ్ములన్
క్రూరతజెండి రక్తమును గ్రోలుదుగాని క్షమింపమందునే.

విక్ర—సోదరా జయసింహా! ఈపలుగాకితో నిక జాగుసేయరాదు. వేగమ కడతేర్చి మనము యుద్ధములోని కేగవలయు. అల్లదే యాదిక్కున సంగ్రామము భీకరరూపమున జెలరేఁగుచున్నది. మన పక్షము గొంచెము వెనుకకు తగ్గుచున్నట్లుకూడ తోఁచుచున్నది. ఆపత్సమయముకాబోలు. త్వరపడవలయును.

జయ—అట్లయిన నీకు యుద్ధమే కావలయునా ?

రామ—ముమ్మాటికిని.

జయ—సరే దుర్మతీ కాచుకొమ్ము. విక్రమసింహా ! నాకు సాహాయ్యముగా సిద్ధముగానుండుము.

రామ—ఓరీ పతితులారా ! రండు. నా ఖరాసి చవినిజూపెదను రండు.

(ఖడ్గములతో బోరెదరు.) [అందరును హతులగుదురు.]

(పురుషవేషధారిణియైన రోషనార ప్రవేశము.)

రోష—ఓ మహమ్మదీయసైనికులారా !

చ. భళీ షహబాస్ ! జయంబుమన ప్రక్కకెమొగ్గెను ! నింక రెండు దె
బ్బలు ! తొలిమాఱ్కినేపిడుఁగుభాతిని దూఁకుడు ! శత్రుసేన లో
పలికిజొరుండు చీల్చికొని పాయలుచేయుఁడు రెండుగాను, ముం
గలఁగల పాయనేమొదట—క్రమ్మఱ రెండవదాని వ్రేయుఁడీ.

కాని, యోమహమ్మదీయ సేనాధిపతులారా ! మీతో నొక్క రహస్యముఁ జెప్పుచున్నాను. మనసైనికులు మరాటులధాటి కాఁగలేక పోవుచున్నారు. శివాజీతుచ్ఛుఁ డెచ్చటనుండి తీసికొనివచ్చెనో కాని యపరమిత బలంబుల బన్నుచున్నాఁడు. ఈ బహిరంగరణ మీరీతి నింక రెండుదినములు జరిగినచో మనకు పరాభవము కలుగునేమో యను శంక పొడముచున్నది. ఆముప్పు రాకమునుపే నేనొక కార్యమును చేయఁదలచుకొన్నాను. రాజగడమునకు నిగూఢగుప్తమగు—మహారహస్య పర్వతద్వార మొక్కటి కలదు. ఈనాటి యర్ధరాత్రిని మనము మూఁడువేల భటులతో బోయి యాద్వారమునుండి లోనికి బ్రవేశించి దుర్గమును వశమొనర్చుకొనవలయు. ఇదియే మనకు

కర్తవ్యము. ఈవిషయమున మీరు అప్రమత్తులరై యుందురుగాక. ఆహా! ఆహా! ఆదిక్కు జూడుఁడు! ఎవరాసేనాని? ఏమి పరాక్రమము! ఓమహమ్మదీయ సైనికులారా! అల్లీ పోరాడుఁడు! ఇదిగో నేనును వచ్చుచున్నాను. అల్లాదీన్!

(అందఱు నిష్క్రమింతురు.)

[యవనిక జారును.]

## ద్వితీయరంగము—యుద్ధభూమి.

(శివాజీ—మోరోపంతు—నేతాజీ, ప్రవేశము.)

శివా—ఓభవానీ! లోకపావనీ! నాసైనికుల—నావీరభటుల నాశీర్వదింపుము.

సీ. కంపితకరముల కన్నబిడ్డల చంక
నిడుకొని తుదిముద్దు లిచ్చినారు
ఎల్తెత్తి జాలిగా నేడ్చెడి భార్యల
విడలేక విడలేక విడిచినారు
దుఃఖబాష్పంబులతో దల్లిదండ్రులు
పలికినదీవెనల్ బడసినారు
పిదప గత్తులుసానబదనిడి దుస్తులు
దాల్చి యుగ్రత దాడిదఱలినారు

పోరుచున్నారిపుడు రుద్రమూర్తులగుచు
వీసమేనియు వెనుకంజ వేయఁబోక
భరతదేశ ప్రతిష్ఠ నిల్పంగఁ దలచి
దేవి! వారల యాశీర్వదింపుమమ్మ!

మోరో—దేవా, మనబలంబులు నేఁ డమోఘ ప్రతాపముతో బోరుచున్నవి. అయినను గంభీరదేశభక్తిని—యుత్కృష్ట వీరశౌర్యములను—మహాద్భుత కరముగా నుద్బోధించు మీ సహజమృదు మధుర వీరవాగ్మామృతధారలచే మనసైనికుల నెల్లర ముంచి, వారికి మఱింత ప్రోత్సాహ మొసర్తురుగాక యనివేడుచున్నాను.

నేతా—మీ రలసినయపుడు మేముగూడ మాకు దోఁచినట్లు పలుకుచుందుము.

శివా—మంచిది. ఓ వీరమహారాష్ట్ర కుమారులారా! హర్ హర్! మహదేవ్! మీకు జయమగుగాక! మీ ప్రభువు—శివాజీ యిట్లు చెప్పుచున్నాఁడు. మీరలు కడుంగడు పావనజన్ములరు—మహా పుణ్యవంతులు. ఏమందురా?

గీ. శస్త్రములుదాల్చి మాతృ దేశంబు కొఱకు
దురమొనర్చెడు భాగ్యమే దొఱకు టరిది;
దొఱికెనా! స్వదేశార్థము దురమునందు
ప్రాణముల నిచ్చు పుణ్య మేర్పడుట యరిది.

ఇందు మొదటిదగు భాగ్యము మీకెల్లరకును, రెండవదియగు పుణ్యము మీలో గొందరకును నేఁటికి లభించినది. ఇంతకన్న నేమి కావలయు?

నేతా—దేవా! ఆదిక్కున మనసైనికులు కొంచెము వెను దీయుచున్నట్లున్నారు. అచటి కేగుదమా!

శివా—శీఘ్రమే. (అందరు నిష్క్రమింతురు.)

(శివాజీ—మోరోపంతు—నేతాజీలు మఱల ప్రవేశము.)

మోరో—ఆ పశ్చిమదిశ మనసైన్యములు జయమునొందు చున్నవేగాని, యీదిశయందుమాత్రము మిగుల నపాయకరమగు స్థితిలో నున్నవి.

శివా—ఔనౌను. ఓ వీరమహారాష్ట్ర సైనికులారా! హార్ హార్! మహాదేవ్! మీప్రభువు శివాజీ యిట్లు చెప్పుచున్నాడు; ఇపుడు మీకెదురై పోరాడుచున్న యీసైన్యములు మన హిందూదేశ స్వాతంత్ర్యమును వినాశన మొనర్చియున్నవి. మన దేవాలయముల నేలమట్టములుగా నొనర్చియున్నవి. మనపల్లెల, పట్టణంబుల దోచుచున్నవి. మన స్త్రీలనుగూడ పలుసారులు చెఱబట్టియున్నవి. అట్టి యీసైన్యముల—దేశకంటకముల—సమూలముగాఁ బెఱికి నైవక విడిచెదరా! మఱల వచించుచున్నాను. బాగుగా గ్రహించుకొనుఁడు. ఈసింహగడము మఱల మొగలులకు జిక్కెనచో మన రాజధానియగు రాజగడము వారికి సులభసాధ్యమగును. రాజగడమే పడినచో మహారాష్ట్రమే పడినట్లు. కావున నోవీరులారా! రణరంగమున బరాజయము నెఱుంగని యోశూరులారా! వీరభారత జననీగర్భ సంజాతులగు నోధీరులారా! మనకీనాఁడు,

చ. జయము లభింపదో విధివశంబున? భారతమాతృకీర్తి? స్వే
చ్ఛ, యదియదేల సర్వమును సంగరభూమిని బూడువంబడున్
జయము లభించునా? భరతజాతిని లేపి స్వతంత్రతాయుగో
దయమును బాడవచ్చు కరతాళరవంబులు పిక్కటిల్లగాన్.

ఇంతయేల? ఈయుద్ధముపై మనభాగధేయము లాధారపడియున్నవి. కావున,

సీ. పరస్వరాజ్యమును సుస్థిరముగా మీరలు
ధరపైన నేలకొల్పఁ దలఁతు రేని
వెనుకటి మీ వీరపితృపూతరక్తంబు
మించుగా మైఁబుల్కరించు నేని
పరిపంథిగణముల పాలుగానీక మీ
కాంతల గాపంగ నెంతు రేని
సాటి హైందవ వీరకోటిలో మీరలు
తలనెత్తి తిరుగఁగాఁదలఁతు రేని

గీ. నిజకిరణజాలసంతప్త నిఖిలజీవుఁ
డై వెలుగొందుచున్న యాయబ్జహితుఁడు
పశ్చిమసముద్రమున నేఁడు పడకమున్నె
విజయలక్ష్మిని గైకొండు వీరులార.

మోరో—దేవా! మీరు కించిత్కాలము విశ్రాంతి దీసికొనుఁడు. ఈలో నేనుగూడ నాకుదోచినట్లు హెచ్చరించెదను. ఓ యోధులారా! హర్ హర్! మహాదేవ్! మోరోపంత్ ముఖ్యప్రధానుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

ఉ. ఆవిధి తొంటి భారతమహాహవభూమిని వీరశౌర్య సం
భావితులై యనేకులగు భారతవీరులు నీటికాల్వలన్
కై వడి బోసినారు తమకండలరక్తము; వీరుఁడొక్కడే
చావునుబొందు; పంద పలుచావుల నొందుచునుండు నిత్యమున్.

మనకు జయము నేఁడవశ్యము లభ్యముకాగలదు. ఏమందురా! మనప్రభు—నాయకుఁడు—శ్రీ శివాజీమహారాజు మనలను స్వయముగా నడపించుచున్నాఁడు. ఆమహాపురుషుఁడు తెల్లనిహాయము నధిరోహించి,

సీ. దేశభక్త్యుత్సాహ దీప్తమై వెల్గు ని
శ్చల శాంతముఖ విలాసంబుతోడ
నలుదిక్కులను కాంతి వెలిగ్రక్కు వివిధ ర
త్నమయ శిరోవేష్టనంబుతోడ
స్వర్ణంపుటొరనుండి సగముగాన్పించెడి
ఖరతరదీర్ఘ ఖడ్గంబుతోడ
రిపుజనగర్భ నిర్భేద్యమై వామహ
స్తంబున జెలఁగు బల్లెంబుతోడ
గీ. శంకరునిరూపమోయను శంకగలుగ
భరతమాతృసుపుత్రుండు భవ్యశౌర్య
ధుర్యుఁడు శివాజి యెదురేగ దొంగవోలె
సందుగొందుల దూఱని శత్రువెవఁడు ?

(తానాజీ ప్రవేశము.)

శివా—(మహాశ్చర్యముతో) తానాజీ ! సింహగడమునుండి యేలవచ్చితివి ? ఎట్లువచ్చితివి ?

తానా—దేవా ! రణము సంపూర్తి జెందినది. మనకు జయము ప్రాప్తించెను. కావున నిర్భయముగా సింహగడమును విడిచి యీశుభ వార్తను మీకు విన్నవింపవచ్చితిని.

శివా—రణము పూర్తియైనచో నాదిశయం దింకను నాకోలాహలమేమి ?

తానా—తనసైన్యమునందు మూడువంతులు నశింపఁగా శేషించిన భటులతో వీరసింహుఁడుమాత్రము పోరొనర్చుచున్నాడు. ఆదిశయందు చెలరేగుచున్న కోలాహలమునకు కారణమయ్యది. ఇంకొక్క విఘడియలో వీరసింహుని పనిగూడ మట్టమగును.

మోరో—తానా—జయ్! శివాజీమహారాజ్‌కీ జయ్!

శివా—ఆహా! ధన్యులము ధన్యులము. భవానీకృప మన యందింకను పరిపూర్ణముగా నున్నది.

(తెరలో శివాజీమహారాజ్‌కీ జయ్ అని మహారాష్ట్ర భటు లరచెదరు.)

శివా—జయశీలురైన మనభటులు సంతోషభరితస్వాంతులై మనజయము నదే యుగ్గడించుచున్నారు. మనమచటికిబోయి వారి వీరశౌర్యము బ్రశంసించి వలయుక్రియల నొనర్పవలయును. ఈ విజయమును మనకు బ్రసాదించిన భవానీమాతకు బూర్ణకృతజ్ఞతా పూర్వక ప్రార్థనముల నిపుడె యిచటనే యర్పించుకొని పోవుదముగాక. (ధ్యానాసక్తులై యుండగా తెఱజాఱును.)



## తృతీయరంగము—యుద్ధభూమి.

(మోరోపంతు ప్రవేశము.)

మోరో—ఓ మహారాష్ట్ర శూరులారా!

గీ. క్రూరులనిమెంచి యాతురుష్కుఁ ద్యజించి
లలితజయలక్ష్మి మన మరాటుల వరించె
యనవసరరక్తపాతంబు నొనరుపకుఁడు
ఆఁపుడా! ఇంక యుద్ధంబు నాఁపుడింక.

శాత్రవసైన్యమునం దారింట అయిదుభాగములు నశించెను. శత్రుసేనానాయకులందఱును హతులైరి. మీర్ జుమ్లాయనువాఁడు

పలాయితుండయ్యెను. ముఖ్యసేనానాయకుండగు వీరసింహుండు— అనన్యసామాన్యములగు శౌర్యపరాక్రమములతో బోరియు పదియు రెండు గాయములుతిని వీరశయన మలంకరింప బోవుచున్నాడు. కావున మీరెల్ల రిఁక నిర్భయముగా రాజగడమునకునడచి శ్రీ శివాజీ మహారాజు దర్శనమునకై హజారమున వేచియుండుండు. జయ్ శివాజీ మహరాజ్ కీ జయ్! కాని, యీవచ్చుచున్న వీరుఁడెవ్వఁడు? ఆహా! రక్తసంసిక్తదుకూలములచే భయంకరమయ్యును, మనోహరముఖవిలాస కలనచే నేత్రపర్వమై కన్పించుచున్న యీమూర్తి యెవ్వరిదై యుండు? ఈ చాటుననుండి యరసెదగాక.

(రక్తపరిప్లుత వస్త్రములతో రోషనార ప్రవేశము.)

రోష—అక్కటకటా!

చ. అపమృతినొందినారు భటులందరు లేఁ డిఁక నొక్కఁడేని, నా
కిపు డిఁక నేఁగసాధ్యమగు? నేఁగతిఁబోయెడిదాన? నయ్యొ, నా
ల్కఁ పిడుచగట్టె; దాహ మధికంబయ్యె; మేను చుఱుక్కుమంచుగా
యపడినచోట్ల నొచ్చె నకటా! భరియింపగనోప నీస్థితిన్.

అయ్యయో! సింహగడమూ లభింపలేదు. శివాజియూ పట్టుబడ లేదు. నాప్రయత్నములెల్ల వృథాయాసకరములైనవి. ఇంకేమిగతి! ఇంకేమిగతి!

సీ. విలపింతునా! నాదుద్వేషంబు నాప్రేమ
యట్ల నిరర్థకమయ్యెననుచు
శాంతింతునా! లేక సర్వదుఃఖముల బా
పెడు మృత్యువే సిద్ధపడియెననుచు
స్మరియింతునా! యెంతమఱచుదమన్నను
మఱపురానట్టి నామరునిమూర్తి

మఱచుదునా! లేక స్మరియించినంతనే
ద్వేషంబుగఱపు నా ప్రియువిరక్తి

గీ. మరణమాసన్నమయ్యును స్థిరతఁగనక
రాగవిద్వేషభావ వైరప్రభూత
భీమసంగ్రామ చలితమై ప్రిదిలియున్న
యీామనంబును భరియించు టెట్టులింక.

(కూరుచుండును.)

మోరో—(తనలో) ఆహా! మహాద్భుతము! మహాద్భుతము! ఈమె యెవ్వతెయో పురుషవేషమునుధరించి రణమొనర్చిన మహా వీరవనిత. ఈ మహావిచిత్రవృత్తాంతమును మాప్రభువున కెఱింగించి తోడ్కొని వచ్చెదగాక. (నిష్క్రమించును.)

రోష—హా! దాహము! దాహము! యిదేమి! చీఁకటిపడు చున్నదా? లేక నాకనులు మూసికొనిపోవుచున్నవా? మెదడునం దిట్లు సందడియగుచున్నదేమి? (మెదడును తడవిచూచుకొని) హా! రక్తము! రక్తము! నా మెదడునకు గాయము తగిలినది! హా! ఇదిగో! వామభుజమున మఱొకగాయము! దైవమా! ఈ కుడిమణికట్టునకు గూడ గాయమే! హా! ఒడలినిండ గాయములే! ఘోరము! ఘోర ము! ఒడలంతయు రక్తమయమైయున్నది. అయ్యో! ఒడలంతయు— నా యొడలంతయు—నా దేహమంతయు—రక్తమయమై యున్నది! అబ్బా! దేహమునం దీబాగలేమి? ఈమంటలేమి? నాయొడలునకు నిప్పంటుకొనెనా? లేదు, లేదు. గాయములవలన బాధ. హా! దుర్భ రము—దురంతము—దుస్సహము! అయ్యో! నాకనులు—నాకనులు— ఈకనుఱెప్ప లిట్లు క్రుంగిపోవుచున్నవేమి? లోకమంతయు నిట్లంధ కారబంధుర మగుచున్నదేమి? హా! దాహము! (కనులుమూసికొని

కొక్కిందక నిదురించి చివాలున లేచి కూర్చుండి) ఆఁ. ఆఁ. విడువకుఁడు! విడువకుఁడు! అల్లే. అల్లే. మనకే జయము! మనకే జయము! పొడవుఁడు. పొడవుఁడు. ఇదే! నేనును వచ్చుచున్నాను (అని లేవఁబోయి పడి మూర్ఛనొందును.)

[శివాజీయును, మోరోపంతును ప్రవేశము.]

శివా—(ఆతురముతోఁ బరీక్షించి) హా! ఈమె రోషనార (కనులు నీరునించుకొని) పంతుజీ! తామేగి మన ప్రాణవైద్యుని వెంటనే తోడ్కొనిరండు.

మోరో—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

శివా—(నాడిఁ బరిశీలించి) అకటా! నాడులు మినుకు మినుకు మనుచున్నవి, జాగుసేయరాదు. ప్రక్కనున్న మడుఁగులోని నీరము దోసిడితోఁ దెచ్చి యీమెచేఁ ద్రావించెదగాక! (పోయి నీరము నారీతి గైకొనివచ్చి యామెచేఁ ద్రావించును.)

రోష—(కనులు తెఱచి శివాజీని గుర్తించి) ఆఁ! ఆఁ! శివాజీయా! శివాజీయా! (చివాలున లేచి కత్తిదూసి) ఆఁ! ఆఁ! శివాజీయా! హా! శివాజి, ఎవరిని వధించుపొంటె యీ మహారణమును సంకల్పించితినో యట్టి—నీవ—నీకై నీవ—నాకిపుడు చిక్కితివా! నాకిపుడు లభించితివా? అటులైన నా ప్రతిన యిఁక నెఱవేరినట్లే! నా యాపజయ మిఁక విజయముగా మారినట్లే! నాపరాభవానలకీలికలిఁక జల్లారినట్లే! హా! క్రూరా! కరుణాలవదూర! మదీయ జీవితాపహారా! మామక సౌఖ్యసంహారా! ఇఁక నెందు బోయెదవు? ఇఁక నెచట డాఁగెదవు? ఇఁక నేకొండల నాశ్రయించెదవు? రమ్ము! రమ్ము! ఇదే నాకరవాలము రమ్ము! రమ్ము! నీశిరమును నాకిమ్ము! (కత్తి నెత్తును.)

శివా—(చిరునవ్వునవ్వుచు) వీరనారీశిరోరత్నమా, అవశ్యము నాశిరము నర్లే యిచ్చెదగాక! కాని, మీకోర్కె నెఱవేరబోదని నుడువుచున్నాను! ఏమందురా, భండనంబున బహువీరశిరఃఖండనంబుచే మీ వీరకరవాలము మొండుగా మొక్కవోయినది. మొద్దువారినది. అందువలన నయ్యది నామొఱటుశిరమును నఱుకం జాలదని తోఁచెడిని. కాన నాయీఖడ్గమును గైకొని మీ యభిమతమును దీర్చుకొనుఁడు. (కత్తినీయఁబోవుచు జనాంతికముగా) సహజకరుణామయ హృదయమగు నీయబల కీ నాపలుకులతో నుగ్రత తగ్గగలదు.

రోష—(తన కత్తిని బారవైచి విస్మితయై భూమిపైఁబడి) హా! శివాజీ! ఇట్టి నీ యమోఘగాంభీర్యమునకే నీయపూర్వ ధైర్యమునకే, నీ వీరసౌందర్యమునకే నా హృదయము—నాదుర్భలహృదయము నీయందు లగ్నమయ్యె! హా! ఇదియేమి! నాహృదయమునందీ విచిత్ర వికృత క్షోభయేమి? ఈ ప్రళయ సదృశ కల్లోలమేమి? ఆగుమాగుము! (కనులుమూసికొని) యేదియో నాహృదయాంతరమునుండి నొచ్చుకొని బయల్వెడలుచున్నది. నాయంతర్దృష్టికి నిర్మలమైన—నిరూపమానమైన—నిష్పన్న శరశ్చంద్ర చంద్రికా సదృశమైన యొకమహాజ్యోతి యేదియో, యొకదివ్య తేజంబేదియో కాన్పించుచున్నది! ఆఁగుమాగుము. (కనులు తెఱచి) హా! తెలిసె! తెలిసె! ఇంతవరకు దన్ను ముమ్మరమ్ముగ గ్రమ్మిన దుర్వికారమేఘఘంక్తులను ఛేదించుకొని బయల్పడి నాయనురాగ చంద్రుఁడు, నాయందు మరల చల్లసి వలపు వెన్నెలల గ్రుమ్మరించుచున్నాఁడు. హా! మనోహరా! మనోహరా! నిన్నుజంపదలంచిన హంత్రిని క్షమింపుము. క్షమింపుము. (మఱల మూర్ఛనొందును.)

శివా—(సపర్య యొనర్చుచు) అయ్యయో! వైద్యుడింకను రాకున్న హాఁడు. ఈవనితకు—పాపము—మరణసమయము సన్నిహిత

మైనది. నాకోటలోనికిఁ గొంపోవుదునా? గాయములు మఱింత పగులువాఱునేమో? ఏమిచేయుదును? (కొంచెమాగి) ఆహా! ఈపె సముఖమున నాహృదయముగూడ యేలనో యలఁతిగాని కలఁత నొందుచున్నట్లున్నది. అగ్నిమ్రోల వెన్నవలె ననంతదివ్య తేజోవికీర్య మాణమైన యీపె యవ్యాజ ప్రేమానలస్పర్శనమున నాహృదయము ద్రవించుచున్నట్లున్నది. అకటా! సూర్యుఁడైన జూడవెఱచు సుకుమారికి—శౌర్యధైర్య ప్రతిభా పరాక్రమతాన ముపార్జితాఖండ భారత మండలుండైన గండరగండని సోదరికి—ఈకవచ ధారణము—ఈఖడ్గచాలనము—ఈరణరంగ విహారము—ఈరుధిర ధారామజ్జనము—ఈకఠినశిలా శయనము—నానలనఁగదా—నాయెడల ప్రేమ వలనఁగదా సంభవించె. ఓ భవానీ! నాతల్లీ! ఈవనితను ఈలావణ్య రాశిని మహమ్మదీయాన్వయ సంజాతనుగా నొనర్చితివేల? ఒనరించిన దానవు నాయందీమెకిట్టి యవ్యాజానంతప్రేమను సంఘటించితివేల? ఘటించినదానవు విచిత్రరీతిమాకు బరస్పరముఖావలోకనమును గల్పించితివేల? కల్పించినదానవు నన్ను హిందూమతధర్మ సాంప్రదాయములయెడల గాఢభక్తునిగా నొనరించితివేల? ఇవియెల్ల నాహృదయమును శోధించుటకా! నాధైర్యమును బరీక్షించుటకో! నాగాంభీర్యమును దలంచుటకో! ఓ మాతా! నలయునెడల నాపంచప్రాణములను పంచభక్ష్యములవలె, నారక్తము నాజ్యమువలె, నాహృదయము నీవు విందారగించు పళ్ళెరమువలె— నిర్భయముగా—నిందు మోదముతో నీకర్పించుకొందును? కాని నామతధర్మమును, నావర్ణధర్మములు, నాయాశ్రమధర్మమును నీకొఱకుగూడ విడువఁజాల! విసర్జింపఁజాల! విసర్జింపఁజాల! ఓజననీ! నాజననీ! ఇఁకనైన నీకఠినపరీక్షను—నీ దుష్కర పరిశోధనమును మానుము! మానుము!

రోష——(కనులు తెఱచి) వలదు. వలదు. ననువిడిచి పో వలదు. నేనా రాజ్యమునకు బోవచ్చును. నీవీ రాజ్యమున నిలువ వచ్చును మనోహరా! యొకింతుక సేపాఁగుము.

శివా——వీరనారీమణీ! నేనిచటనే యున్నాను.

రోష——(నెమ్మదిగా లేచి) ఉండుముండుము. నాకు విసరుచు నీసుకుమారహస్తములను నొప్పించుకొనకుము! కాని మనోహరా! నీవు నన్నిప్పటికైన ప్రేమించితివా? ఆఁగుమాఁగుము. ప్రత్యుత్తరమీయ కుము. హా! ఈయకుము. ఎట్టిఘోరప్రశ్న నడిగితిని! మహారాష్ట్ర నాయకా! నా ప్రశ్నమున కౌననియో, లేదనియో చెప్పియుందువు. ఔననియందువా నీప్రేమ ననుభవించుట కాయువు సెల్లెగదాయని దుఃఖింపవలసివచ్చును. లేదనియందువా, తొంటికన్న కుత్తుకబంటి దుఃఖసాగరమున మునుగవలసివచ్చును. ఈరెండు ప్రత్యుత్తరములలో నేదియైనను నాకు హృదయవిదారకమే! కాన నా ప్రశ్నయు వలదు. నీ ప్రత్యుత్తరమును వలదు. నీవు నన్నిప్పటికి ప్రేమించియుందువనియే నేనుతలంచి తృప్తిని జెందుచుంటిని. ఆతృప్తియే నాకీ యంత్యసమయ మున మనశ్శాంతి నిచ్చుచున్నది. ఆతృప్తితో నసీసముఖమున నన్ను దీర్ఘనిద్రఁ జెందనిమ్ము. ఏమిది! నాకనులు తిఱుగుచున్నవా? లేక భూమి తిరుగుచున్నదా? ఆఁ ఆఁ! ఎవరుమీరు? ఎవరుమీరు? దేవ కన్యకలా! (నవ్వి) ఓకన్యలారా! వచ్చుచున్నాను. మీదివ్యరథము నొకించుకసేపు నిలుపుఁడు. మనోహరా! నీవిచ్చటనే యుంటివా? నేనిక నైదారునిమేషములకన్న నెక్కుడుకాలము జీవింపను. నా యవ సానకాలపుకోర్కె యొండుకలదు తీర్చెదవా? అది ప్రేమవిషయి కము కాదులెమ్ము.

శివా——అవశ్యము తీర్చెదగాక!

రోష—అట్టులైన నల్లదే కుసుమశోభితములైన యాతీవెలలో నొకదానిని నాకొఱకు ద్రెంపితెమ్ము.

శివా—(నిష్క్రమించి పూఁదీఁగెతో మఱల ప్రవేశము.)

రోష—(లతను దీసికొని) మహారాష్ట్రభూపతీ! పరభామినుల మాతృసమానులనుగాఁ బరిగణించు పరమసౌజన్యనిధి యెవ్వరనిన నిన్నుఁ జేర్కొని యితరులఁ జేర్కొనవలయు. హిందూమతధర్మ సాంప్రదాయములను బునరుద్ధరింపగల మహావీరుఁడెవ్వరనిన నిన్ను జెప్పి యితరులఁ జెప్పవలయు. ధనధాన్యములు రానిమ్ము, రాజ్య సామ్రాజ్యములు చేకూరనిమ్ము, సత్యమార్గము నొక్కయడుగైన దాటని నిశ్చలశాంతధీర గంభీరమూర్తి యెవ్వరనిన నిన్నుడివి యితరుల నుడువవలయు. ఇట్టి సుగుణరాశికి—ఇట్టి ప్రతిభాశాలికి—ఇట్టి జితేం ద్రియునకు—ఇట్టి వీరభారతకుమారునకు—నీకుఁగాక భవన్మాతృ దేశగౌరవ స్వాతంత్ర్యపునరుజ్జీవనప్రతిష్ఠ యెవరికిఁదక్కును? కాన నో భూపతీ! మీ శ్రీరామునికి బిదప—మీ పాండవులయనంతరము— మీ దేశమునందు నేఁటికి మఱల స్వతంత్ర హిందూపతాకమును నాటుదువు. నీవు మఱల యఖిలహిందూ జనపతి వయ్యెదవు. భూసు రాశీరవంబులతో, భాసురవేదనాదంబులతో, పవిత్రసప్తనదీయంబుల భట్టువై భవంబున నచిరకాలమున నీవు ఛత్రపతివిగా నభిషిక్తుఁడ వయ్యెదవు. కాని, యకటా! తద్వైభవముల గనులారజూచి యానం దించుభాగ్యము నాకేది? లేదు. కావున నిచ్చటనే యిప్పుడే నారక్త ముతో నీలలాటము నిట్లు తిలకమును సవరించి, యీలతాకిరీటముతో నీశిరము నిట్లలంకరించి నిన్నిదే ఛత్రపతినిగా జేసి నే నానందించు చున్నాను. ఛత్రపతీ, సలాములు.

శివా—(నవ్వుచు ప్రతిసలాము లొనర్చును.)

రోష—ఓ కన్యలారా! నాపనులు ముగిసినవి. ఇఁకరాండు. సిద్ధముగా నున్నాను. ఛత్రపతీ! సాలా-ములు-నన్ను-మఱువకుము. మ-ఱు..............................(మరణించును.)

శివా—(కనులు నీరు నించుకొనుచుండును.)

యవనిక జాఱును.



# అ ను బం ధ ము లు.



[గ్రంథకర్తగారిచే రచియింపఁబడినవి.]

### (1) రామసింహుఁడు.

ఎల్లెడ క్షామములెగదా, యెందువిన్న నేడ్పులేకదా, హిందూ దేశమందు నెల్ల యితనిపాలనంబున॥ నెల్లెడ॥ హిందువుఁడగుచు నిలను జన్మమొందుటె ఘోరపాపమయ్యె, నందును బ్రాహ్మణుఁడగుచు బుట్టుటసలె పాపమయ్యెను, గుడుల నేలమట్టముగా గూల్పగ శాసనమును జేసిన క్రూరుడు, కరుణ యెఱుఁగని యఘోరుఁడు సతతమును అఘ విచారుఁడు, దుర్వికారుఁడు. ఆపాదుష క్రింద॥ నెల్లెడ॥

### (2) రామసింహుఁడు.

కృతార్థుఁడనైతిగా మీవలన॥ కృతా॥ సదా దేనికై మదిన్ దలతునో యదే మీవలనగదా సఫలమయ్యె॥ కృ॥ మిముగని వినగా కని విని చనఁగా, చని ముద మొందగా, కలగెను నేమగా, నిరంతర కృపాకరా, క్షితికరా, దురితహరా, మీవలన॥ కృ॥

### (3) రామసింహుఁడు.

నాదేశంబిది, నాహక్కిది, నాజన్మభూమి యిది యాహాహా॥ నా॥ నాబలముఁను, ధనమును, సుఖమును, సర్వము నాభూమికొఱకు ధార బోసెదను॥ నా॥ రంజనచెడి యీరాజుల గొలిచిన రాట్కులయశంబు దూలు, గంజియైన గడుగైనను నాస్వాతంత్ర్యపు కూడేమేలు॥ నా॥

(4) రోషనార.

వారేవారె! శయ్యాగారమెంతో కదువింతగొల్పెనాహా॥ వా॥ రోషనార కింపారఁ గొల్పెగా, శ్రీనివాసమై మెఱయుచుండె నోఁగా॥ వా॥ నవరత్నవిలసితమై శృంగారలక్ష్మి కులుకుచుండె, యానందలక్ష్మి యొప్పుచుండె, శ్రీసౌఖ్యలక్ష్మి కులుకుచుండె చోద్యము, గాంచితిన్! వారె॥

(5) రోషనార.

వారెవారె! యీహృదయతాపము నెటుల సైచుదున్॥ హా॥ వారె॥ క్రూరుడో మారుని బారికోర్వజాల, అహా మదన నీకిదియె యదన?॥ వారె॥

(6) రోషనార.

మూర్తిమంతు నేడు చూడనయ్యెగా॥ మూర్తి॥ నేడు చూడ నయ్యెగా, నేడు చూడనయ్యెగా॥ మూర్తి॥ నామది మోదమెసగ, కనులపండువై తగ ఖేదమెల్ల బాసిపోవ నాదుపుణ్యవశమున॥ మూర్తి॥

(7) రోషనార.

నామదిగల యాకోరికదాపన్ జాలమి కేల సుందరుడా,-హా॥ నామది॥ అందగాడవై యవనిజనించియు నాహృదయమున నాటితి ప్రేమము॥ నామది॥ అనితరసంలభ్యశిరీషకుసుమసుకుమారసుందరమైన, యీదేహము అతిసులభముగ—ననాయాసముగ—సమూచితముగ— నీపాలుగానున్న నీకేలా యీమానము, ఈలలితపరిమళమిళితలతాంత దంతురితమైన యీపుష్పవనమున, ననుగూడరావేర? ఓహో మనోహరా॥ నామది॥

(8) రోషనార.

ఎందుకింత యలుక, నీ॥ కెందు॥ అయొ ఎందు॥ సుందర సుకుమారుడవయి, సుదతుల నేడ్పించుట కేగాక టుగానియెడల ఎందు॥ ఇంతి యిటురమ్మనవా చెంతనన్ను జేర్చుకోనవా, సుంతయైన దయగనవా, యెంతచెప్పినను వినవా, పంతమేల ప్రాణనాథా, అబల నార్త నకట నాపై॥ ఎందు॥

(9) శివాజీ.

అమ్మా, నాహితవు వినగదమ్మా, యీదేహము మట్టిబొమ్మా, దీని వలచుటొకసుఖమ్మా, యిది నిలచుటొకనిజమ్మా, ఓ॥ యమ్మా॥ కనియుకనదు వినియువినదు కామము కడువెఱ్ఱిదిసుమ, దానిని నీమది నమ్మకుమా॥ ఓయమ్మా॥ వలదిది కడుచెడు పనియని తనహృదయము విధవిధముల బోధింప, పాపగంధభరిత మీచపలబుద్ధికి లేదుభీతిలేదునీతి॥ అమ్మా॥ ఆత్మకులశీలవంశ యశో వినాశకరము దైవనియతసృష్టి నిర్మాణములకు మిగుల విరోధకరము, దేహబలమనోబలహీనకరము, తన్మూలమున నాయుష్కాల పరిమాణక్షయకరము, పరతరుణుల కోరగరాదని యెఱిఁగి కోరు టెంతపాపము నీకు తెలియని నీతికలదె? సర్వశాస్త్ర సమోపేత॥ వమ్మా॥

(10) రోషనార.

కడుబడలినావో పలుమాటలాడి॥ కడు॥ ప్రియురమ్మిటు నా కురులనీడ నిలు॥ కడు॥ దాహమయ్యెనా యకటకటా నాయధరసుధా రసమును గ్రోలుమురా, గ్రోలి నను సుఖించి విందుగొను॥ కడు॥

(11) శివాజీ—రోషనార.

శివా— తాళుతాళుముబాల తగదునీకీగోలా, సుజనసమ్మతమైన నాడు హితము విని సమ్మతిని జను సద్గతిని గనుము వెతబడక॥ తాళు॥

రోష—తగునె యీవిటుబలుక, ప్రియ॥ తగు॥

శివా—ఒరువిధిని యెటులబలుక,

రోష—తనువలచిన తరుణిగవయ తగునె యీవిధితగవులు॥

శివా—మనతగవులెల్లజూడగ దైవంబులేడె పైన, యాఘనుని కనులు గట్టగ గలమె యీజగాన,

రోష—ఓ ప్రియుడా నీకిట్టి చిన్నతనమున నిట్టిబుద్ధి పుట్టుటకు నాదు పాపవశమున కాబోలు,

శివా—అటులవగవకుమా, బుద్ధియెందును స్వయంజ్యోతి స్వరూపమగు భగవంతు డటంచు దలంచుమా,

రోష—బుద్ధియే యట్టిదగునెడల, భగవత్సముంబగునట్టిబుద్ధికి పాపపుణ్యంబులనునవి యుంటునా, ఆకతమున నను నీకౌగిట నిక బాలింపుమా,॥ తాళు॥

## (12) రోషనార.

హాసఖా, హాసఖా, ఆహాసఖా॥

కరుణదొఱగి బాసిపోవమేలా, హా, హా, హా, హా॥ హా॥ విరహజలధి నన్ముంచి జనగా నీకిదితగునా, ఇటులసేయుట పెను వగనా అకటా సుందరవదనా, ఏమన నీపుప్పవని, నీపదనీరజసరణి, జని నిను బాడగనజాలక ఘనతరమగు వగను బడితిగా హాహాహా॥హా॥

## (13) రామోజీ.

నాతినిన్ గవయుటే సుఖకరమనినమ్మితి నిక్కముగను రమ్మికను॥

నాతి॥ కనకపుబొమ్మా కౌఁగిలినిమ్మా ఇకయిటురమ్మా ఒకముద్దిమ్మా॥

నాతి॥ చూచితి నీదగుసౌందర్యంబు, మోచితిపెఱిగిన మోహపు భారము వేచితినీకై విధవిధములుగా, నోచితి మాఁరశరాసారము,

జాలముసేయక బాలయికనా గోలతీర్పకున్న నిన్నువిడువను॥ నాతినిన్గవయుటే॥

(14) రోష—రామోజీ—శివాజీలు.

రోష—నీదురాశవీడుమా, మీదుమీదు రాకుమా॥ నీదు॥ మీదుమీదురాకు మిక్కిలి ప్రేలకు మేరమువిూరకు మెదలకు॥

రామో—కలికినాపయి చలముపూనగ కారణమేమిటో దెలుపుమా.

శివా—(ప్రవేశించి) ఏల యీాయాగడమిచ్చట.

రోష—రాజ! చూడుమీా తుచ్ఛుని ముచ్చట.

శివా—సాటివారువిన్న చాలనవ్వుబాటు, చాలుచాలు నిట్టిసరసములు.

రోష—నీదురాశ.

(15) రోషనార—శివాజీ.

రోష—ఏలరా నాథా జాలిమాలి యీావిధమున సునిశిత మనసిజశరములవేపగా, దలపడితివి॥ దేలరా॥

శివా—తగదటంచు బలువిధముల తరుణియరసిచెప్పగా, వినవుకనవు తెలిసియు దెలియని విధమున నొప్పెగా, మేలమా, నారీ, పాపపుణ్యభేదమెఱిగి పటుతర మోహాంధమున మునుంగగాదలపడితివి.

రోష—ఏలరా.

(16) రజాక్ దావూదులు కలసి పాడవలెను.

1. కాఫర్ లోక్కీ కంతాల్ మాకీ సఫాయిసేయిస్తా, హిందూస్తానాకి రాజ్యాల్ హంతా మట్టీమేమిస్తాం॥ కాఫర్॥

2. దేవుడుగుళ్ళూ దిబ్బల్‌సేసి మసీదుకట్టిస్తాం, భాపన్‌వాడ్కి పిలకల్ గొంటికి తురకల్ సేపిస్తాం ॥కాఫర్॥
3. హాడికిహీండికి లడాయ్‌పెట్టి హజామత్ సేయిస్తాం, మద్దెస్‌మాకి తమాషచేసి పైకం లాగేస్తాం॥ కాఫర్॥

(17) రజాక్.

భళిరదారూ, భళిరప్యారీ, దోనోకిబల్‌జోడా, హాయ్‌హాయ్ దోనోకిబల్ జోడా హాయిహాయి॥ భళిర॥ సారాహంతా రద్దుసేసి ప్యారీమన్కి ముద్దుపెట్టి, సారాప్యారీ, ప్యారీసారా వారేవారె హాయ్ హాయ్॥ భళిర॥

(18) దావూద్.

అరె దేఖో దేఖో హాడదిలాగవుంది॥ అరెదేఖో॥ సూడసూడ దాని జాడ తెలియవచ్చె॥ అరెదేఖో॥ నిగనిగలాడెనిప్పురవ్వొళ్ళు, సుర సురలాడే సూపురకళ్ళు, మిలమిలమోతీల్ మెలతపళ్ళు॥ అరెదే॥

(19) దావూద్.

ఈనడకరగమక్, ఈచూపుచమక్, ఇకదీన్కిమించినది లేదూ॥ ఈనడక॥ ఏక్ దఫాదీన్కిముద్దాడి, బల్ మజాసేస్తదిమాకి॥ ఈనడక॥

(20) రజాక్—దావూద్—రోషనారలు.

రజాక్—రామెరామె మాతో ఇయ్యాల ఓలిబాల.

దావూద్—దే నీకీ బల్ జోనా నాజీ బల్ జోబనా మన యిద్దర్కీ జోడోనుసాలా.

రజాక్—కటాకీ, మిటాగీ, వయ్యారీ మైప్యారీ కన్నులిక్కి యిప్పి సూడారాదా.

దావూద్—చంబేలి, రంగేలి, రసేలీ, ఖయ్యాలీ, మాఘర్కి మెల్లామురావా.

రోష—ఏమిసేయుదానా నేనెటులపోవుదానా, ఎవరటంచు దలచితిరో తులువలార తొలగిపొండు, తొలగకున్న, చలము బలము నణచెద తఱిగెద నఱకెద.

రాజాక్—దావూ—రామెరామె.

(21) దావూద్.

మెప్యారీ వయ్యారీ॥ మెప్యారీ॥ ప్యారీ, కటారీ, దిల్‌హారీ, హమారీ, మైనారీ॥ మెప్యారీ॥ తోడతోడ దయసూపి మాటలాడుబే, కొంచెం నోరు తెర్చి మాకిమీద నవ్వుసెయ్యిబే, కొంచెంకళ్లుయిప్పి మాకిసూసి సైగసెయ్యిబే, ఆవుబే హాహా॥ మెప్యారీ॥

(22) రజాక్.

ప్యారిహోక్క ముద్దు మాకి తిన్పించు॥ ప్యారి॥ నీమీదినా కియ్యాల బల్‌రంగుహైంది హో బాలా, కటారి మిటారి వయ్యారి మై॥ ప్యారి॥

(23) దావూద్.

నారిజరాముద్దుల్కి తిన్పించుబేమై॥ నారి॥ ముద్దుల్కి తిన్పించు మొగం నాకి సూపించు॥ నారి॥ నాకీ నీకాసేస్తి మంచి షర్కర్కి, లడ్డుపకోడీకి, బాదంకా హల్వాకి, పీచుమిఠాయీకి, బోజన్ బజా యించి, సూరత్ కా బీచిమీద ఘోడాగాడీ మేబల్ షికార్ సెలా యిద్దాం॥ నారిజరా॥

(24) రామసింహుఁడు.

జగమునందుకలదె నాదుజన్మభూమివంటిది, సకలదేశములకు రాణి నాదుజన్మభూమి నాదుజన్మభూమి నాదుజన్మభూమి॥ జగ॥ కుంజకుంజములకు లెక్క కూయువిహంగావళులు, సంజకెంజాయలలరు సంతసంపుదినములు॥ జగ॥ గంగాతరంగనివిమృష్టమహాఘరాజీం, గీతా రహస్యపరిబుద్ధనమస్తలోకాం, త్రింశత్త్రికోటికలనాదనియుక్తశోభాం, వీరాతివీరపరిపోషితదివ్యకీర్తిం॥ జగ॥

(25) మోలజీము.

పైసాఖాతిర్ లీహువా, కైసా లడాయీ, సేసేదితోసదు, హైసరా పైసా॥ దిల్ గబరాహోతాహై, దిగుల్ బి ఆతాహై, ప్యాగల్ హల్లామె క్యాకరుం పైసా॥

(26) మోలజీము.

ఆవోరీ మేరిరంగేలే మైప్యారి, ఆవో ఆవో కటారి, వారెవారె మైనారి॥ ఆవో॥ సుక్క్యాల్క్యా సీరెగట్టి, పక్కా సామ్మ్యాల్క్యా పెట్టి, టక్కూ టక్కూ నగాడి హెక్కి షికార్ కోట్ దాక॥ ఆవో॥

(27) రామసింహుఁడు.

మీరీరీతి స్వకార్యపడన్ దగునా, అయ్యయోమహాత్మా॥ మీ॥ కష్టసుఖంబులు కావటికుండలు, కానిదినములనె కన్పడుధీరత॥ మీ॥ సాధుధేను సంహారు దలచి, భూపతితాలయ బృందముదలచి, తాపస జీవనదుస్థితిదలచి, యఘోరదుఃఖిత ప్రజగతిదలచి, స్వదేశరక్షణము నకై రోఁజనుండి దూసినట్టి ఖరాసిని ముదువక జే జయ జయ భారత మాతయనుచు, బోరొనర్చి వైరులన్ ద్రుంపకే॥ మీ॥

(28) సభికులందఱును కలసిపాడవలెను.

భరతమాతా జయ, భరతమాతాజయ॥ భరత॥ మాతా ప్రఖ్యాతా నమస్తే॥ భరత॥ వరవీరచరిత సారతసుధారత మధుర మధుర కవితా॥ భరత॥ స్వదేశభక్తి, స్వతంత్రానురక్తి, స్వగౌరవాసక్తి కల్గునట్లుగా స్వవీరశౌర్య ప్రతాపసముజ్జ్వల నిరాఘాటధాటికను వర్తనంబు ప్రవర్తించునట్లుగా, నిరంతరంబు మాభారతసోదరుల దీవిం పుమా కన్నతల్లి, కల్పవల్లి, నీకొడుకుల మము మఱువకుమా॥ భర॥

